# సత్యగీత



సంకలిత పరిష్కర్త :

బాలసరస్వతి, ఉభయభాషాకవి, శివనాడీప్రవీణ, సాహిత్యరత్న, కవిరత్న,
భిషగ్రత్న, ప్రబంధక, వైద్యభూషణ

పండిత : ద్వివేది నారాయణశాస్త్రి

ఏలూరు.



ప్రకాశకులు :

కొంపల్లి హనుమంతరావుగారు

రిటైర్డు ఇంజనీరు

గుడివాడ.



**1956**

# భూమిక





చదువరులారా!

నేనీపొత్తము నాకలనముచేయుటకు గారణం బేమనగ? శ్రీరంగాపురము కరణముగారగు శ్రీరుద్రవరపు వేంకటరామకృష్ణ శర్మగారి ధర్మపత్నియు శ్రీఅడివికొలను కామేశ్వరరావు, గౌరి శంకరదత్తుగార్ల సోదరీమణియు నగు శ్రీమతి శ్రీ కామేశ్వరాంబగారి యంతరంగంబున నెలకొని జీవసమాధియన నావె యందావేశించిన శ్రీ సత్యనారాయణస్వామివారు, ఏలూరు శ్రీ కందుకూరి శరభంగారి లోగిట్లో యుండగా వినుకలిచే శ్రీ చిలకమర్తి కస్తూరిరంగాచార్యులు బి.ఏ., బి.యల్., గారితో నేను వెలువడి శ్రీ స్వామివారి యావేశసమయమున వారి వాక్యాదుల నాలించి దర్శించివచ్చితి. మఱునాఁడు రంగాచార్యులుగారితో వచ్చినపండితుడు రావలసినదని శ్రీవారి యాజ్ఞయగుటం జేసి తదాజ్ఞ శిరసానహించి నేనేగితిని. వెళ్ళిన యనుక్షణమున నే శ్రీవారావేశించి భక్తుఁడా! అని సంబోధించి మూలగ్రంథము నాచేతనిడి లేఖనాది స్ఖలితములు సవరణచేసి యాకలితము సహితముగా బరిష్కరింపుము నీ శ్రమ సఫలీకృతము కాగలదు. మాచే బహూకరింపబడుదువు, నీకు మేలయ్యెడుమనియాశీర్వదింపగా శ్రీవారి యాశీర్వాదమేమహా బహూకృతిగాదలంచి మహాత్ముల వాగ్రచనల క్రోడీకరించి తత్తదనుగుణముగ నీగ్రంథము 3 ఉల్లాసములుగ గావించితి. శ్రీవారు "స్త్రీ అభాగిని" దీనిపేరు. నీకు తోచినపేరు మఱొకటి చెప్పుమని సెలవీయగా స్వామీ! సత్యగీత యని నామకరణముచేసిన సమంజసముగ నుండనోపునని మనవిచేయగా

శ్రీ స్వామివారు బాగు, బాగు! స్త్రీ అభాగిని, అను 'సత్యగీత' యని పేరిడిరి. శ్రీవారావేశసమయమున ననుగుఱించి నొడివిన వాక్యావళి మదాశీర్వచన భాగ్యపుంజమేయని యెంచితి. శ్రీ స్వామివారు మరల యావేశించి, భక్తుఁడా! యని నన్ను సంబోధించి నాభక్తులు శివపూజా నిష్ణాతులునగు మహోదారపురుషులు స్వకీయద్రవ్యముతో ముద్రింపించి యాగ్రంథములు నీకొసంగెదరు. ఏతద్గ్రంథ సర్వస్వామ్య సంకలితుడవు నీవే. కవియనగా భగవత్స్వరూపి. గౌరవనీయుడు. అందుచే మాచే బహూకరింపబడి మదాస్థానకవిగఁ బరిగణింపఁబడి గౌరవింపబడుదువు. మా ప్రియభక్తులు వేయి గ్రంథప్రతులు ముద్రింపించి నీ కొసంగెదరు. అందు స్త్రీ అభాగిని వంశావళి ముద్రాద్రవ్యవితీర్ణుల వంశముక్తావళిగూర్చి యిందు చేర్చుము. స్తుతులువ్రాయుము. అని యేమేమో మఱియు మహావాక్యములు వక్కాణింపగా నవియెల్ల నాదీవనలగా నెంచుచుండ నంత శ్రీవారావేశము చాలించిరి. శ్రీ స్వామివారి లీల లత్యద్భుతములు, వర్ణనాతీతములు. శ్రీమతి భక్తురాలి జాతక గ్రహోచ్చయేగాక యామెయడుకాలియందు చక్రాదిచిహ్నాలు జిహ్వాస్థలమందు బాలా బీజాక్షరత్రయము నెలకొనుటంజేసి యామె దైవాంశసంభూత, మహాత్మురాలనక తప్పదు. ఇట్టివారి సందర్శనభాగ్యము లభించుటగూడ ప్రాక్తనజన్మ జన్మార్జిత ఫలభాగ్యపుంజ మనజాలు.

శ్రీవారి యాజ్ఞాప్రకారము భక్తురాలి వంశావళియు, శ్రీభక్తురాలి తాతగారు నీ సత్యగీతా ముద్రణాది సర్వవ్యయములు తమ సొంతద్రవ్యముతో భరించినవారును, భూరి వితీర్ణి శిరోమణులు, కవిపండిత ప్రియులు నగు రిటైర్డు యింజనీరు

శ్రీ కొంపల్లి హనుమంతరావుగారి వంశముక్తావళియు నిందు కూర్చి చేర్చితిని. మొట్టమొదట శ్రీరంగాపుర సత్యనారాయణ స్వామివారి మానసబోధాష్టకమొకటి గీర్వాణభాషలో రచించి చేర్చితిని. అయ్యది భక్తవతంసులకెల్లరకు పఠనీయము, బహు ఫల ప్రదాయి యని నుడువజెల్లు. శ్రీ స్వామివారి సంపూర్ణ కరుణాకటాక్ష వీక్షణాఫలముచే నీపొత్తము 3 ఉల్లాసములుగ సంపూర్ణము చేయబడినది. ఇందు మహాత్ముల యుద్గ్రంథములు, ఉపనిషద్వాక్యావళి, పురాణేతిహాసములు, వేదములు, సంహితలు, భాగవతము, భారతము, భారద్వాజాది కృత తంత్రములు, వేమనాది మహాత్ముల పద్య గద్యములు చేర్చబడినవి. ఈ గ్రంథము శ్రీ స్వామివారిపేరనే యంకితమొనరించితిని. నాలోటుపాటులు శ్రీస్వామివారే సవరణచేసినన్నాశీర్వాదరూపముగా రక్షించి కటాక్షింప వేడికోలు. మఱియు నియ్యది యమూల్యగ్రంథరాజమని విశేషించి నిర్వచించిన శ్రీ స్వామివారికి వందన సహస్రములు.

పవరుపేట,
ఏలూరు,
1-12-56.

बालसरस्वति उभयभाषाकवि
शिवनाडीप्रवीण साहित्यरत्न
कविरत्न भिषग्रत्न प्रबंधक
दैवज्ञभूषण
पण्डित-द्विवेदि नारायण शास्त्री



# శ్రీ రంగాపుర సత్యనారాయణ మానసబోధాష్టకమ్

★

౧. శ్రీదేవీవదనారవింద తరణిం శ్రేయోనిధిం శ్రీకరం
వేదాంతాధ్వచరంత మాదిపురుషం చింతాంబుధేర్బాడబం
వ్యాధివ్యాళసువర్ణ పక్షిమమలం భక్తార్తివిచ్ఛేదినం
శ్రీరంగాపురవాసినం భజ మనః శ్రీసత్యనారాయణమ్.

౨. రాగధ్వాంతదివాకరం సురుచిరం చిన్మూర్తి పూర్తంపరం
బ్రహ్మేశేంద్ర మహేంద్రవందిత పదం బ్రహ్మాండ
భాండోదరం
బ్రహ్మానందపదప్రదం కమలినీ బైబ్బేక హేవాకినం
శ్రీరంగాపురవాసినం భజమనః శ్రీసత్యనారాయణమ్.

3. బ్రహ్మాదిక్రిమికీటకాంతజనకం భాషావిశేషాంచితం
సర్వాకర్షణ పండితం మృడనుతం శుండాల లక్ష్మీపతిం
సేవ్యత్సర్వ సుపర్వకోటి సహితం శేషాహివాహేశయం
శ్రీరంగాపురవాసినం భజమనః శ్రీసత్యనారాయణమ్.

౪. శ్రీమద్రుద్రవరాన్వయాబ్ధి విలసత్కామేశ్వరాం బాముఖే
హ్యావేశ్యాఖిలభూతభావిక భవిష్య ద్వృత్తగాధావళిం
సమ్యగ్వాచకవాచినం రుచికరం దృష్టాంతచేష్టాయుతం
శ్రీరంగాపురవాసినం భజమనః శ్రీసత్యనారాయణమ్.

౫. కాలవ్యాళమృగాధిపం ఘనపురం కంసాది హింసాకరం
సంసారార్ణవ తారణోల్బణచణం రోచిష్ణు జిష్ణుం హరిం
మాయోపాయదురూహ దుర్జనహరం జ్ఞేయంచసుజ్ఞానినాం
శ్రీరంగాపురవాసినం భజ మనః శ్రీసత్యనారాయణమ్.

౬. శ్రీమద్రత్న గిరీంద్రసుందర మహాదేవాలయే వాసినం
సత్సంకల్పలఘుత్వసత్వరహనత్రాప్రాగ్భ్యరభారాకరం
శంఖంచక్రగదాదికం కరతలే కౌమోదకీం ధారిణం
శ్రీరంగాపురవాసినం భజమనః శ్రీసత్యనారాయణమ్.

౭. లక్ష్మీంవక్షసి పక్షిణంచ తురగం పృష్ఠేవహంతం శ్రుతం
వ్యాత్తుద్వైః పురతోన్వహంచ సులభంసంద్రష్ట్య
మాణంవిభుం
క్షేమస్థేమ కటాక్షరక్షిత జగత్కల్యాణమూర్తిం సదా
శ్రీరంగాపురవాసినం భజ మనః శ్రీసత్యనారాయణమ్.

౮. శాంతం పూత మనంతగాత్ర మతులం దుస్తూలవాతూలకం
నీలేందీవరలోచనం ఘనరుచిం చంద్రాననం శంకరం
భక్తత్రాణపరాయణం కలియుగే ప్రత్యక్షదైవం,సతాం
శ్రీరంగాపురవాసినం భజ మనః శ్రీసత్యనారాయణమ్.

కృతం నారాయణాఖ్యేన
సత్యనారాయణాష్టకం
సర్వచింతావినిర్మూలం
పఠతాంహి ఫలప్రదమ్.

శ్రీసత్యనారాయణ పరబ్రహ్మార్పణమస్తు.



# సత్యావేశినీవంశావళి



సీ. కేదారమోదార కేవలసస్యాల
కాపురంబల్ల రంగాపురంబు
శ్రీ అభాగిని సత్యదేవాది సురగణ
శ్రీపురం బల్ల రంగాపురంబు
భక్తిప్రభావ సంభరిత మానవగణా
వాపకం బల్ల రంగాపురంబు
దురిత దురూహాత్త దుర్జన పశుగణ
ద్వీపీంద్ర మల్ల రంగాపురంబు

గీ. ప్రణుత వర్ణత్రయీ మూర్తి పాదజాది
లోకనికరోచితంబు విలోకనీయ
పుణ్యపుంజ విచిత్రిత పూతధాత్రి
కలికి కలుములతావు రంగాపురంబు.

సీ. రఘువంశభూషణ రాఘవస్వామికి
మొదటి యాతిథ్య మేముని యొనర్చె
శ్రీ కాళహస్తిగిరి ప్రదక్షిణ వర్త్మ
పుష్కరిణీ తపఃపూతుఁడెవఁడు
ద్రాహ్యాయణీయ సూత్ర పవిత్రసామవే
దీయాదులకు మునిదేవుఁడెవఁడు
తనపేర వరసంహితల నెన్నో రచియించి
లోక యశంబెవం డాకలించె

గీ. బ్రహ్మనిష్ఠుఁడతఁడు భరద్వాజమౌని
యతనిగోత్రోద్భవులలోన యడివికొలను

వారనఁగ వెలసిరి ధర వరుసనందు
మాన్యుఁ డచ్యుతరామయ్య మంత్రి వోడమె.

గీ. అతని కిద్దఱుదారలు విమల మతులు
సాధ్వి కామేశ్వరాంబయు శారదాంబ
యందుఁ గామేశ్వరాంబకు నాత్మజనులు
రమ్యభావి కామేశ్వరరావు పిదప
సుదతి బాలాత్రిపుర మహాసుందరమ్మ.

గీ. సారిది శ్రీ శారదాంబకు శుభచరిత్ర
యతివ కామేశ్వరాంబ మహాత్మురాలు
సత్యదేవ సమాధిగ శాంతురాలు
తనరె శ్రీగౌరిశంకర దత్తసంగ.

గీ. భవ్యకామేశ్వరాంబ శ్రీవత్సగోత్ర
భవుడు శ్రీరుద్రవరపు సువంశ జనితు
గీత్రికాము వేంకటరామకృష్ణశర్మ
భర్తగాఁగొని సంతాన భాగ్యమందె.

సీ. దైవభక్తికిమేటి తార్కాణ యేచాన
పరిశుద్ధి కేతల్లి పాలవెల్లి
విద్యార్జనమున కే వెలదిపెట్టినపేరు
చుట్టాలకేకొమ్మ పట్టుగొమ్మ
కరుణాంబురాశి యేకాంత యార్తులకెల్ల
కవులపాలింటి కేకలికి సురభి
జనతతికేతన్వి జనయిత్రి సద్వర్త
నమునకేయమ్మ ఘంటాపథమ్ము

గీ. సత్యనారాయణస్వామి సత్సమాధి
నిష్ఠనుండు పతివ్రత నిరుపమాత్మ
కలిత రంగాపురాలయ కర్త్రి సత్య
మూర్తి కామేశ్వరాంబను బ్రోచుగాత
బహుకుటుంబిని గర్భనిర్భర కుటుంబి.

గీ. ప్రణుతబాలాత్రయాక్షరి రసనయందు
వరదుచక్రాది చిహ్నాలు చరణమందు
నోలి జాతకపంచగ్రహోచ్చమొప్పె
అర్ధదైవాంశ సంభూతురాలు భళిర
అవని కామేశ్వరాంబ మహాత్మురాలు.



# ఏతత్ గ్రంథ ప్రకాశకుల వంశావళి



సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుండు కొంపల్లి
మల్లికార్జునరావు మహితయశుఁడు
మహాలక్ష్మి నాబడు మహిళాశిరోమణి
తద్ధర్మ పత్న్యన్న దానసక్త
ఆదంపతులకును నాత్మజల్ మూవురు
వేంకటసుబ్బమ్మ విమలచరిత
రాఘవమ్మయు నెడి రమణీలలామయు
వేంకట లక్ష్మమ్మ వినుతశీల
వేంకటరమణయ్య వీరశైవాచార
జపతపోనిష్ఠుఁడు శాంతమూర్తి
హనుమంతరావన హనుమదుపాసియు
వీరమాహేశ్వర విమలభక్తి
రామా శిరోరత్న రాఘవమ్మకుమారి
శారదాదేవి యాశారదాంబ
అవ్వారారోహకు నాత్మ సూతిమతల్లి
కామేశ్వరమ్మ నా ఘనచరిత్ర

గీ. సత్యనారాయణస్వామి సత్సమాధి
నిష్ఠశాంతస్వరూపిణి నిర్మలాత్మ
మహిత హనుమంతరాయని మనుమరాలు
తివిరి హనుమంతరాయ డదృష్టశాలి.

ఉ. ధీరుఁడు సాహసాంకుఁడు సుధీకవి సన్నుత సచ్చరిత్రుఁడు
చ్చారిత సత్యవాక్య సువిశారదమూర్తి సమర్చితాంబికా
వీరమహేశ్వరుండు సువివేకనికాయుఁడు నింజనీరనన్
చేసుప్రతిష్ఠగన్న నయవేది శివాలయ సంప్రతిష్ఠకా
కారుడు దైవభక్తి ధృతకాయుఁడమేయ వదాన్యశాలిలన్.

గీ. వినుతరంగాపురంబున వెలయునట్టి
సత్యనారాయణస్వామి సదములాజ్ఞ
నలిద్వి వేదికవీంద్ర సంకలితపూత
సత్యగీతామహాగ్రంథ సంప్రకాశు
డర్థి హనుమంతరావు నిరామయుఁడగు.

శా. రామానంద సరస్వతీంద్రయతి పద్రాజీవమాధ్వీరస
స్థేమాఘ్రాణనబంభరుండు శుభకృద్ధీకుండు శ్రీకుండు ప్రో
ద్దామోదారగభీరభావుఁడు కవీంద్రద్వీపిరాజత్సప
ర్యామోదాత్ముఁడు చాలకాలమెసఁగున్
హన్మంతరావిద్ధరన్.

గీ. కూర్మి హనుమంతరాయుని ధర్మపత్ని
క్షేమగుణసీమ్ని భ్రమరాంబ శ్రీపురంధ్రి
యొలమి దంపతుల కపత్యమెసఁగుఁగాత
సత్యనారాయణస్వామి సదయదృష్టి.

ఉ. సత్యవచోవిభూషణుఁడు సత్త్వగుణాభరణుండు సత్కవి
స్తుత్యుఁడు సుప్రసన్నముఖ సుందరగాత్రుఁడు వీతిహోత్రనే
త్రాత్యయ పూజనావిధివిధాన విశారదుఁ డిందిరాసతీ
సత్యసుపర్వ భక్తినిధి జానలరున్ హనుమంతరావొగిన్.

సీ. హనుము దుపాసనాఘనుఁడు షడక్షర
బాలా మహామంత్ర పటుజపిష్ఠి
అర్థి ప్రాసాద పంచాక్షరీజపశాలి
వైజ్ఞానిక కాలాప విజ్ఞమౌళి
రహిఁ భాగ్యనగరాధి రాజ్యంబునందుఁ దా
నింజనీరై ఖ్యాతి నెసఁగినాఁడు
ధర్మ తత్పరమతి దానశీ లకళంక
వర్తనుండు యశస్వి ప్రణుతసుమతి

గీ. తల్లజుండును భ్రమరాంబ వల్లభుండు
శాంతమూర్తి సుధీకవి సత్కృతమతి
సత్యదేవ మహాదేవ చరణసేవి
రాణ దైవాఙు హనుమంతరావు భువిని.



## కృతి సమర్పణము

గీ. సత్యదేవాజ్ఞఁ గలితమౌ సత్యగీత
సత్యనారాయణస్వామి చరణకమల
సన్నిధి సమర్పణంబుగ సంస్కరించి
యంకిత మొనర్చినాఁడనయ్య నఘుపేర.

ఇట్లు,
భారద్వాజ - ద్వివేది.




శ్రీ కొంపల్లి హనుమంతరావుగారు,

( రిటైర్డు యింజనీరు )



సంకలిత పరిష్కర్త:

పండిత- ద్వివేది నారాయణశాస్త్రి

ఓన్నమః పరస్మై

# " స్త్రీ అభాగిని "

## ( అను )

# సత్యగీత



శ్లో॥ అచింత్యాఽవ్యక్తరూపాయ । నిర్గుణాయ గుణాత్మనే
సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥

వ. శ్రీమంతంబును ద్వైతంబును నద్వైతంబును సుజన సులభ ప్రాప్తంబును దుర్జన దురాపంబును త్రిశూన్యంబును త్రికకలితంబును సత్యయుతంబు నమేయంబు నిరుపమానసౌఖ్య లతా వేల్లితంబు త్రింశత్కోటి సుపర్వ పార్వణంబునగు శ్రీ వైకుంఠ నగరరాజంబున త్రిజగత్కల్యాణ కారణుండై నిర్హేతుక జాయమాన కరుణాకటాక్షవీక్షణుండగు శ్రీమన్మహావిష్ణువు, ఇందిందిర సుందర వేణియగు నిందిరాదేవితో జయ విజయాది ద్వారపాల బృందంబులాది యెల్లరు వందనంబులు పొందుగ నొనర్చుచుండ శివ బ్రహ్మాదులు స్తవించుచుండ సనకసనందనాది మునిపుంగవులు నౌపనిషద్వ్యాహారంబుల నగ్గించుచుండ పేరోలగంబుదీర్చి జగత్త్రితయలీలలు వాక్రుచ్చుచుండగా విని కలహాశనుండగు నారదమహాముని యిట్లు పృచ్ఛచేసెను.

నార:-ఓ లోకరక్షకా! మహానుభావా! మీరు సెలవిచ్చినది బాగుగనే యున్నది. కాని యనేకావతారములెత్తి భక్తులను రక్షించుచు, దుష్టులను శిక్షించుచు వర్ణనాతీతములయిన యనేక మహా కార్యములు సేయుచుండిరి. ఓ జగన్నాటక సూత్రధారా! కిల్బిష నిలయంబయిన యీ కలియుగమందు నవతారం బెత్తవేమి? అనేకులు భక్తులు నీ కొఱకు మొఱవెట్టుచు కడగండ్లఁ బడుచు దుఃఖించుచుండఁ "దేవుడు లేఁడు లే"డని యెల్లెడ మార్మ్రోగుచుండ, "అహమస్మి" వాక్యంబు నిరూపించ వేమి? యను కారణంబు సవిస్తరంబుగ నానతీయుమని శివబ్రహ్మాది సకల నిలింప నికురుంబము సమక్షమున కలహాశనమునిస్వామి పృచ్ఛసేయ శ్రీమంతుండగు శ్రీ వల్లభుండిట్లు వక్కాణింప దొడంగె; కలియుగము మహాపాప నివాసమనియు, అధర్మము, అజ్ఞానము నెక్కువగుటం జేసియే యవతారంబు నెత్తననియు, ఆవేశ ముఖముగా నక్కడక్కడ నావిర్భవించి యధర్మము నశింపజేసి ధర్మము స్థాపించుచు నక్కడక్కడ మదీయ మహిమలు నిరూపించెదననియుఁ జెప్పగా.

శివ బ్రహ్మాదిదేవతలు:-స్వామీ! యిదివఱకు నెక్కడనైన నావిర్భవించితిరా? లేక - ఆవిర్భవింపబోవుదురా? అని ప్రశ్నించిరి. అంతట

మహావిష్ణువు:-అక్కడక్కడ ఆవిర్భవించియుంటిని యింకను నావేశించెదను.

శివ:-స్వామీ! స్త్రీలయందా? పురుషులయందా?

మహా:-పవిత్రతగల స్త్రీలయందును బురుషులయందును గూడ నావేశించెదను.

శివ:-నారదుడు- ఓ మహానుభావా! లోకబాంధవా! నీ లీల లత్యద్భుతంబులుగదా! పర్వతములు, వృక్షములు, పరాశరాములు, బౌద్ధము మొదలయిన యనేకములయిన యుపాధులయం దుద్భవించి లోకోద్ధరణార్థై మీరుచేసిన మహాకార్యకలాపంబులు మే మేమని వర్ణింపగలము? మీకు మీరేసాటి! మదీయవిజ్ఞప్తి యొకటుండు కద్దు - అయ దెట్లంటేని! మా యెల్లరిపక్షమున యీ నారదమహాముని పృచ్ఛచేయుచున్నాడు. వ్యాఖ్యానమొనరించి వినుపింప గోరెదము-

మహా:-నారదా! నీ సందేహము లడుగుము వారు కోరిన కరణిని వాక్రుచ్చెద

నార:-స్వామీ! మహాత్మా! మహానుభావా! ముల్లోకవల్లభా! ముల్లోకముల తల్లి ముద్దుమగండా! శ్రీహరీ! నమస్తే నమస్తే నమస్తే నమః - పితామహా! ధ్యాన విధానంబు వేదాంతవిద్య - భగవత్ప్రాప్తికి యోగకారణంబులు మొదలగునవి ప్రశ్నించెద నవధరింపుడు -

నార:- భగవత్ప్రాప్తికి సాధనము లెవ్వి! ముముక్షుత్వ మెట్లు కల్గు?

మహా:-నారదా!

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యమ్।

ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

శ్లో॥ గురోర్వ్యక్త్రేణైవ జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః
అన్యథాలభితం నాస్తి సత్యం సత్యం పునః పునః॥

శుకరహస్యోపనిషత్తు - తాత్పర్య మేమనగా - పిపీలికాది బ్రహ్మ పర్యంతము సకల జీవజంతువుల హృదయములందు సర్వసాక్షిగా వ్యాపించియుండు పరబ్రహ్మమగు సచ్చిదానంద శుద్ధచైతన్యమే పరమాత్మ యనబడును. అట్టి పరమాత్మయే గురువనబడును. గుశబ్దస్త్వంధకారస్స్యాత్. రుశబ్దో దాహ ముచ్యతే - గు అనగా అంధకారము - అజ్ఞానము, దానిని పోగొట్టునదియే గురుశబ్ద వాచ్యము. మఱియు,

కం. గురుడనఁగాఁ బరమాత్ముఁడు
పరగంగా శిష్యుడనఁగ పటుజీవుఁడగున్
గురుశిష్య జీవసంపద
గురుతరముగ గూర్చునతడు గురువగు వేమా॥

అనగా జీవశబ్ద వాచ్యార్థముగాక లక్ష్యార్థమగు ప్రత్యగాత్మ - ఈశ్వరశబ్ద వాచ్యార్థముగాక లక్ష్యార్థమగు పరమాత్మలకు మొదట సృష్టివలన కలిగిన భిన్నత్వ మెటువంటిదో యీ జన్మకారణమును మరల మోక్షమువలన నారెంటికిని కలిగియున్న ఏకత్వ మెటువంటిదో యీ మోక్ష కారణమును స్వానుభవమార్గమును జూపించి జన్మరాహిత్య మొనర్చు వాడే గురువనబడును. గాని తక్కినవా డెంత మాత్రము గురువు గాజాలడు.

# ప్రథమోల్లాసము

గీ. పుట్టు చావును రెంటికి బొరయనట్టి
నిర్మలజ్ఞాన సంపూర్ణ నిష్ఠగలుగు
తెలివు గనిపించు నాతఁడె గురువరుండు
నవ్యతరభోగి శ్రీ సదానందయోగి॥

ఆ. వె. "తల్లిదండ్రిలేని తనయునిపోలిక
పతికి బతియులేని చందమునను
గురువులేనివిద్య కూడ చెందులకైన
నజునికైన నిజము నరసిచూడ"

ఆ. వె. తల్లి దండ్రి కలరు తగ జన్మజన్మాన
నరయ బంధుమిత్రు లట్లు కలరు
తన్నుఁదెల్పు గురుఁడు తగదొరకఁడుభువి
దొరకు నెల్ల ముక్తి దొరకుటధిప.

ఆ. వె. తల్లిదండ్రి ఋణము దైవర్షి ఋణమును
తన్ను నెఱుగదీఱు తత్త్వమందు
బరమగురుని సేవ పాటింపనుండిన
ఋణము దీఱదండ్రు రూఢిమునులు॥

గీ. సూచక నిషిద్ధబోధకవాచకులను
గడఁగి కామ్యకర్మ సమయకారణులును
ననగ నెనమండ్రుదేశికు లందులోన
సద్గురుండగు కారణాచార్యవరుఁడు.

సీ. సద్గురుధ్యానాత్మ సంపన్నుఁడగువాని
నలకాలివ్రాత యెవ్వనికిలేదు

సతతంబు కారణాచార్యుఁ జేరినవాని
కొనగోరబోల నెవ్వనికిఁగాదు
శ్రీ గురు శుశ్రూష సేయ నేర్చినవాని
చరణరేణువు సమంబెవరుఁగారు
దేశికప్రీతిగా దిరుగ నేర్చినవాని
సరి సహస్రాంశ మెవ్వరునుగారు

గీ. దాన మౌన చాంద్రాయణ ధ్యానవిహిత
మంత్ర తంత్రాధ్యయన జప మర్మకర్మ
తీర్థయాత్రాదిక స్నానదేవ ధర్మ
దైన నాచార్యుజేరిన వానిసమమె?

శ్రీరామ స్తవరాజమునందు సూతుండు శౌనకాదిమహా మునీంద్రులకిట్లనియె నట్లు ద్వైపాయనుండు కౌంతేయాగ్రజున కిట్లనియె.

శ్లో॥ అజ్ఞాన సర్ప దష్టస్య, బ్రహ్మజ్ఞానౌషధం వినా
కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః॥

అనగా నజ్ఞానమను సర్పముచే గరువబడిన మందు ఉన్నదున్నట్టనెడి బ్రహ్మజ్ఞానము తప్ప తక్కిన మందులగు వేదశాస్త్ర పురాణేతిహాసంబులవలన స్వస్థత గలుగజాలదు సుమండీ! మఱియును "సంసార దీర్ఘరోగస్య స్వవిచారో మహౌషధ"మన్నట్లుండెడి తానే యీ దేహేంద్రియమనః ప్రాణంబు సంసార"మనఁబడును. అట్టి దీర్ఘరోగమునకు దివ్యౌషధములుకాబట్టి పరమాత్మ విచారణయే అన్నిటికన్న మిన్న.

నార:—మహాత్మా! ఆత్మానాత్మ వివేకము గుఱించి చెప్ప గోరెద, పృచ్ఛచేసెద;

మహా:-నారదా! అడుగుము చెప్పెద.

నార:-ఆత్మకు దుఃఖ మెందు వలన గలిగెను?

మహా:-శరీరమును పొందుటచేత ఆత్మకు దుఃఖము కలిగెను.
ఇందుకు ప్రమాణమేమన?

శ్రుతి- "సహవైన శరీరస్య సతః ప్రియా
ఽప్రియయో రపహతిరస్తి"

అనఁగా శరీరాభిమాన మున్నంతవఱకును దానికి - ఇష్టానిష్టములయొక్క నాశనము లేదు.

నార:-ఆత్మకు శరీరపరిగ్రహము దేనిచేత నగుచున్నది?

మహా:-కర్మచేతను.

నార:-కర్మ దేనివలన కలుగుచున్నది?

మహా:-రాగాదులవలన.

నార:-రాగాదు లెందువలన గలుగుచున్నవి?

మహా:-అవివేకమువలన.

నార:-అవివేక మెందువలన కలుగుచున్నది?

మహా:-అజ్ఞానమువలన.

నార:-అజ్ఞాన మెందుచేత కలుగుచున్నది?

మహా:-దేనిచేతను గలుగదు. అజ్ఞానము ఆదిలేనిదియును, ఆత్మకంటె భిన్నమా? అభిన్నమా? అనియును చెప్పనలవి కానిదియు నయియున్నది. అజ్ఞానమువలన, అవివేకము పుట్టును. అభిమానమువలన రాగాదులుపుట్టును. రాగాదులవలన కర్మలుపుట్టును. కర్మలవలన శరీర పరిగ్రహము

కలుగుచున్నది. శరీర పరిగ్రహామువలన దుఃఖము కలుగుచున్నది.

నార:-దుఃఖమునకు నాశమెప్పుడు కలుగును ?

మహా:-"సర్వాత్మనా" అనఁగా సర్వావస్థల యందును శరీర పరిగ్రహామునకు నాశనము కలిగెనేని దుఃఖమునకు నాశము కలుగును.

నార:-"సర్వాత్మనా" అనుపదమెందు నిమిత్తము చెప్పబడెను?

మహా:-సుషుప్త్యవస్థయందు దుఃఖము పోయినప్పటికిని తిరిగి నిద్రలేచిన తోడనే దుఃఖము పుట్టుటంబట్టి సుషుప్తి కాలమందు ఆదుఃఖము వాసనా రూపముగా నుండుటంబట్టి యడియును లేకుండ నుండుటకై "సర్వాత్మనా" పదము చెప్పబడెను; గనుక "సర్వాత్మనా" అనగా అన్ని విధముల చేతను శరీరపరిగ్రహామునకు నాశనము కలిగినప్పుడు దుఃఖమునకు నాశము కలుగుచున్నది.

నార:-శరీరము లేకపోవుట యెప్పుడు కలుగును ?

మహా:-"సర్వాత్మనా" అనఁగా, అన్నివిధములచేతను కర్మ నశించెనేని శరీరము లేకుండ నుండును.

నార:-కర్మ యెప్పుడు నశించును ?

మహా:-"సర్వాత్మనా" రాగాదులు నశించెనేని కర్మకు నాశము కలుగును.

నార:-రాగాదులకెప్పుడు నాశము కలుగును ?

మహా:-"సర్వాత్మనా" అభిమానమునకు నాశము కలిగినప్పుడు రాగాదులకు నాశము కలుగును.

నార:-అభిమానమునకు నాశ మెప్పుడు కలుగును.

మహా:- అవివేకమునకు నాశము కలిగినప్పుడు అభిమానమునకు నాశము కలుగును.

నార:-అవివేకమునకు నాశ మెప్పుడు కలుగును ?

మహా:-"సర్వాత్మనా" అజ్ఞానమునకు నాశము కలిగినప్పుడు అవివేకమునకు నాశము కల్గును.

నార:-అజ్ఞానమునకు నాశ మెప్పుడు కలుగును ?

మహా:-బ్రహ్మయును, ఆత్మయును - ఒక్కటే యను జ్ఞానము పుట్టగానే 'సర్వాత్మనా' అజ్ఞానమునకు నాశనముకలుగును. అయినచో నిత్యకర్మలు- అవశ్యము చేయవలసినదని శ్రుతి స్మృతులలో చెప్పబడియుండుటవలన - అట్టి నిత్యకర్మల వలన- అవిద్యకు నాశము కలుగునుగదా! జ్ఞానముచేత నేమిప్రయోజనము ? అని శంకించినదానికి ప్రత్యుత్తర మేమనఁగా? కర్మాదులవలన అవిద్యకు నాశములేదు. అది యెందుచేతననఁగా? కర్మకును అజ్ఞానమునకును విరోధము లేదుగనుకను జ్ఞానమునకయినచో అజ్ఞానమునకు విరోధము కలదు. అందువలన జ్ఞానముచేతనే అజ్ఞానమునకు నాశము కలుగును, గాని కర్మవలన కలుగదు. ఆ జ్ఞాన మెట్లు కలుగునంటివేని విచారమువలననే కలుగును.

నార:-ఈ విచారము చేయుట కధికారము కలవారెవరు ?

మహా:-సాధనచతుష్టయముతో గూడినవారు.

నార:-సాధన చతుష్టయ మనఁగ నేమి ?

మహా:-నిత్యాఽనిత్య వస్తు వివేకము, ఇహాఽముత్రార్థఫల భోగ విరాగము, శమాది గుణషట్క సంపత్తి, ముముక్షుత్వము, అని సాధనములు, నాలుగు.

నార:-నిత్యాఽనిత్య వివేకమన నేమి ?

మహా:-బ్రహ్మము సత్యమనియు, జగత్తు అసత్యమనియును కలుగు నిశ్చయజ్ఞానము.

నార:-ఇహాఽముత్రార్థఫల భోగవిరాగ మనఁగ నేమి ?

మహా:-ఈ భూలోకమందలియును, స్వర్గలోకమందలియును వస్తువులయొక్క ఫలములను భోగించుటయందు నిచ్ఛలేక పోవుట, అనఁగా - ఈ లోకమందు శరీరధారణకు కావలసినవానికంటె అనగత్యమైన యన్యవిషయములగు - పుష్పమాలికలు, చందనము - సుగంధతైలములు విలువగల వలువలు, మితిమీరిన మిష్టాన్న భోజనములు సుఖశయ్యాదులు - స్త్రీలు మొదలగువాని యందు - వాంతి చేసిన యన్నము- మూత్రపురీషములు మొదలగువానియందెట్లు, ఇచ్ఛయుండదో, అట్లే యిచ్ఛలేకుండుట, దీని పేరే ఇహలోక ఫలభోగ విరాగ మనఁబడును. స్వర్గలోకమునందుండు రంభా సంభోగము మొదలగు విషయములందును "జ్యోతిష్టోమ స్వర్గ కామోయజేత - అను వేద వాక్యము లున్నప్పటికిని నిరీహుఁడైయై సేయుచు వాని

యందు ఇచ్ఛామాత్ర శూన్యుడైన యెడల - అముత్ర ఫలభోగ విరాగ మనంబడును.

నార:-శమాది షట్క మనఁగ నేమి ?

మహా:-శమము, దమము, తితిక్ష, సమాధానము, శ్రద్ధ, ఉపరతి, అని ఆఱు.

నార:-శమమనఁగ నేమి ?

మహా:-అంతరింద్రియ నిగ్రహము. అంతరింద్రియ నిగ్రహమనఁగా- మనస్సు. దానిని నిగ్రహించుట అనఁగా శ్రవణాదులకంటె వేఱయిన - కామ క్రోధాదులనుండి మనస్సును మళ్ళించుట.

నార:-దమమనఁగ నేమి ?

మహా:-శబ్దాదులగు బాహ్యవిషయములనుండి యింద్రియములను మఱలించుట. మఱియు శ్రవణమననాదులయందు మనస్సును దృఢముగా నుంచుట.

నార:-ఉపరతి యనఁగ నేమి ?

మహా:-ఆయా వర్ణాశ్రమములకు - ఏర్పడిన కర్మలు శ్రుతి యొక్క విధిని యనుసరించి పరిత్యజించుటయు, వేదాంత వాక్యములు వినుటయందే కుతూహలముతోఁ బ్రవర్తించుటయు,

నార:-తితిక్ష యనగ నేమి ?

మహా:-శీతోష్ణాదులను సహించుటయును, తన దేహమును కొట్టెడు పురుషుఁడు తనయెదుట నున్నప్పటికిని తనకు

కొట్టుటకు శక్తియుండియును పరుని యపరాధమును సహించుటయును-

నార:-సమాధానమనఁగ నేమి ?

మహా:-శ్రవణాదికములయందు ప్రవర్తించెడి మనస్సు విషయ వాసనా వశము వలన నెప్పుడెప్పుడు భోగముల యందు ప్రవర్తించునో అప్పుడప్పుడు అవి దోషములని తెలిసికొని వానివలననుండి మనస్సును మళ్లించుట.

నార:-శ్రద్ధ యనగ నేమి ?

మహా:-సద్గురు బోధనయందును, వేదాంత వాక్యముల యందును మిక్కిలి నమ్మకముంచుట - ఇది శమాదిషట్క మనఁబడును

నార:-ముముక్షుత్వమనఁగ నేమి ?

మహా:-మోక్షమందు మిక్కిలి తీవ్రమయిన కోరిక - ఇది సాధన చతుష్టయ సంపత్తియనఁబడును - ఇవి గలవాడు సాధన చతుష్టయ సంపన్నుఁడనఁబడును. దీనికి ఆత్మాఽనాత్మ విచారణయం దధికారము గలదు. తదితరునకు లేదు. వానికి ఆత్మాఽనాత్మ విచారణ చేయదగినదియై యున్నది. మఱియొకటి చేయఁదగినదిలేదు. బ్రహ్మచారికి స్వాధ్యాయము (వేదము చదువుట) తప్ప మఱియొకటి చేయదగినది యెట్లు లేదో అటువలె పైని చెప్పబడిన యధికారికి ఆత్మాఽనాత్మ విచారము తప్ప మఱియొకటి లేదు. సాధనచతుష్టయ సంపత్తి లేకపోయినను గృహస్థుఁడు ఆత్మాఽనాత్మ విచారము చేసిన యెడల అందుచేత ప్రత్య

వాయసము (దోషము) లేదు. వాఁడు మిక్కిలి శ్రేయస్సుగల వాఁడగుచున్నాఁడు. ఇందులకు ప్రమాణ మేమనగా -

శ్లో॥ "దినే దినేచ వేదాంత శ్రవణా ద్భక్తి సంయుతాత్ గురు శుశ్రూషయా లబ్ధాత్కృచ్ఛ్రాశీతి ఫలంభవేత్"

అని చెప్పఁబడియున్నది అనఁగా - ప్రతి దినమందు భక్తితో గూడికొని యున్నట్టిదియును గురువునకు శుశ్రూష చేయుటవలన పొందబడినట్టిదియును - అయిన వేదాంత శ్రవణమువలన నెనుబది కృచ్ఛ్రముల ఫలము, గృహస్థునకు సంభవించును. అని దాని తాత్పర్యము--ఈ కారణము వలన - ఆత్మాఽనాత్మ విచార మందఱిచేతను చేయబడదగినదియని సిద్ధాంతిత మయినది.

నార:ఆత్మయనఁగ నేమి ?

మహా:-'శ్రుతి- అవినాశీవా అరేఽయమాత్మా' స్థూలశరీరము సూక్ష్మశరీరము, కారణశరీరము, అను శరీరత్రయముకంటె వేఱయినదియును, పంచకోశములకంటె వ్యతిరిక్తమైనదియును, మూఁడవస్థలయందును సాక్షి యయినదియును, సత్తు, చిత్తు, ఆనందము, ఇవియే స్వరూపముగా గలదియును.

నార:-అనాత్మయనఁగ నేమి ?

మహా:-అనృత జడదుఃఖములు స్వరూపముగాగల సమష్టి వ్యష్ట్యాత్మకమైన శరీరత్రయము.

నార:-శరీరత్రయమనఁగ నేమి ?

మహా:-స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము, అను మూఁడు శరీరములు.

నార:-స్థూలశరీరమనఁగ నేమి ?

మహా:-పంచీకృతములయిన మహాభూతములవలనఁ జేయఁబడినదియును, కర్మవలనఁ బుట్టునదియును జన్మము మొదలుగా గల ఆఱు భావములతో గూడికొని యున్నదియును, ఈ ప్రకారమే పంచీకరణమందుఁ జెప్పబడియున్నది.

"ద్విధావిధాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః
స్వస్వేతర ద్వితీయాంశై ర్యోజనాత్పంచపంచను
పంచీకృతమహాభూత సంభవం కర్మసంచితం,
శరీరం సుఖదుఃఖానాం భోగాయతన ముచ్యతే"

తాత్పర్యము:-పంచభూతములలో ప్రతిభూతమును రెండు భాగములు చేయవలయును, వానిలో ప్రతి మొదటి భాగమును తిరిగి నాలుగు భాగములు చేయవలయును, తర్వాత ప్రతి భూతముయొక్క అవిభాజితమైన రెండవ భాగముతో శేషించిన నాలుగు భూతములలో ప్రతి భూతముయొక్క విభజిత భాగముయొక్క ఒక్క చతుర్థభాగమును చేర్చినట్టులయిన నదియొక పంచీకృత మహాభూత మనఁబడును. అట్టి మహా భూతములవలన బుట్టునదియు నైన శరీరము సుఖదుఃఖముల కనుభవస్థానమని చెప్పబడుచున్నది. ఎట్టులనిన ?

"శీర్యతే వయోభిః బాల్య కౌమార యౌవన
వార్ధకా వస్థాభిశ్చ" శీర్యత ఇతి శరీరం॥

వయస్సుచేత జీర్ణమైపోవునది. బాల్యము, కౌమారము యౌవనము, వార్ధకము, వీనిచేత జీర్ణించునదిగాన శరీరమనఁబడును.

"దహ భస్మీకరణ ఇతిధాతో రుత్పత్త్యా
దహః భస్మీభావం ప్రాప్నోతి".

తగలపెట్టబడుచున్నది. కాన దేహ మనఁబడుచున్నది. కొందఱి దేహములు తగలపెట్టబడుచున్నవి. మఱికొందఱి దేహములు పాతిపెట్టుటవలన మన్నైపోవుచున్నవి. సమస్త దేహములు తగలపెట్టఁబడుచున్నవని యెట్లు చెప్పఁబడుచున్నవి? అని శంకించిన, అదియు ఒకానొక యగ్నిచేత తగులపెట్టఁబడుట సంభవమగును. సమస్తమైన స్థూల దేహములకును, ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము, అను మూఁడగ్నులచేత దహ్యత్వము (తగలబడుట) సంభవమగును.

నార:-ఆధ్యాత్మికమన నేమి?

మహా:-తనదేహము నధికరించి ప్రవర్తించునది, అధ్యాత్మమనఁబడును. అధ్యాత్మచేత చేయుబడిన దుఃఖము ఆధ్యాత్మికమనబడును. అనఁగా శిరోరోగము మొదలైనవి.

నార:-ఆధిభౌతిక మననేమి?

మహా:-భూతము నధికరించి ప్రవర్తించునది అధిభూతము అట్టి అధిభూతముచేత చేయుబడునది, ఆధిభౌతిక మనఁబడును. పెద్దపులులు, దొంగలు మొదలగువానివలన పుట్టినదుఃఖము.

నార:-ఆధిదైవిక మననేమి?

మహా:-దేవుని యధికరించి ప్రవర్తించునది, అధిదైవికము, అట్టి అధిదైవముచేత చేయబడినదుఃఖము- ఆధిదైవిక మన బడును. పిడుగుపడుట మొదలగువానివలన పుట్టినదుఃఖము.

నారః:-సూక్ష్మశరీర మన నేమి ?

మహా:-పంచీకృతముకాని భూతములనుండి పుట్టిన సప్తదశక మైనది లింగశరీరము.

నారః:-సప్తదశకమన నేమి ?

మహా:-జ్ఞానేంద్రియములు ౫ కర్మేంద్రియములు ౫ ప్రాణము మొదలయిన వాయువులు ౫ మనస్సు - బుద్ధి అని ౧౭ సంఖ్యగలది.

నారః:-జ్ఞానేంద్రియము లేవి ?

మహా:-శ్రోత్రేంద్రియము, త్వగింద్రియము; చక్షురింద్రియము, జిహ్వేంద్రియము, ఘ్రాణేంద్రియము.

నారః:-శ్రోత్రేంద్రియ మనఁగ నేమి ?

మహా:- కర్ణము, అను నవయవముకంటె భిన్నమైనదియు చక్కిలమువంటి కర్ణమంతటను వ్యాపించు నాకాశమున కాశ్రయమైనదియు శబ్దమును గ్రహించు శక్తిగలదియునైన యింద్రియము శ్రోత్రేంద్రియ మనఁబడును.

నారః:-త్వగింద్రియ మనఁగనేమి ?

మహా:-చర్మముకంటె భిన్నమైనదియు, చర్మమున కాశ్రయ మైనదియు, యావచ్ఛరీరమందు వ్యాపించియుండునదియు

స్పర్శమును గ్రహించుటయందు శక్తిగలదియు నైన యింద్రియము త్వగింద్రియ మనబడును.

నారః-చక్షురింద్రియ మనఁగ నేమి ?

మహాః-నేత్రగోళము నాశ్రయించి యుండునదియు, నల్లని గ్రుడ్డుమధ్య నుండునదియు రూపము మొదలగువానిని గ్రహించుటయందు శక్తిగలదియునైన యింద్రియము చక్షురింద్రియము.

నారః-జిహ్వేంద్రియ మనఁగ నేమి ?

మహాః- నాలుకకంటె భిన్నమైనదియు నాలుకచివర నుండునదియు రసము మొదలగువానిని గ్రహించుటయందు శక్తి కలదియు నైన యింద్రియము జిహ్వేంద్రియ మనబడును.

నారః-ఘ్రాణేంద్రియ మనఁగా నేమి ?

మహాః-ముక్కుకంటె భిన్నమైనదియు ముక్కుచివర నుండునదియు వాసన మొదలగు వానిని గ్రహించుటయందు శక్తి గలదియునైన యింద్రియము ఘ్రాణేంద్రియ మనఁబడును.

నారః-కర్మేంద్రియము లేవి ?

మహాః- వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, అను పేర్లు గలవి.

నారః-వాగింద్రియమనఁగ నేమి ?

మహాః- వాక్కుకంటె భిన్నమైనదియు, అష్టస్థానము లందు ప్రవర్తించునదియు, శబ్దము నుచ్చరించుశక్తి గలదియు నైన యింద్రియము వాగింద్రియ మనఁబడును.

నార:-అష్టస్థానము లేవి ?

మహా:-హృదయము కంఠము, తల, పై పెదవి, క్రింది పెదవి, రెండు దవడలు, జిహ్వ, అని యెనిమిది స్థానములు.

నార:-పాణీంద్రియ మనఁగ నేమి ?

మహా:-చేతికంటె భిన్నమైనదియు, హస్తదేశము నాశ్రయించి యుండునదియు, ఇచ్చుట, ఇయ్యకపోవుట, ఇచ్చినదానిని పుచ్చుకొనుట వీనియందు శక్తిగల యింద్రియము పాణీంద్రియ మనఁబడును.

నార:-పాదేంద్రియ మనఁగ నేమి ?

మహా:-పాదముకంటె భిన్నమైనదియు, పాదదేశ మందుండు నదియు, వచ్చుట, పోవుట వీనియందు శక్తిగలదియు నైన యింద్రియము పాదేంద్రియ మనఁబడును.

నార:-పాయ్వింద్రియ మనఁగ నేమి ?

మహా:-గుదముకంటె భిన్నమైనదియు, గుదము నాశ్రయించి యుండునదియు పురీషమును విడుచుటయందు శక్తి గలదియు నైన యింద్రియము పాయ్వింద్రియ మనబడును.

నార:-ఉపస్థేంద్రియ మనఁగ నేమి ?

ఉపస్థకంటె భిన్నమైనదియు. యోనిద్వారము నాశ్రయించి యుండునదియు, మూత్రము, నెత్తురు, శుక్లము వీనిని విడుచుటయందు శక్తిగలదియు నైన యింద్రియము- ఉపస్థేంద్రియ మనబడును. ఇవి కర్మేంద్రియము లనబడుచున్నవి.

నార:-అంతఃకరణ మనగ నేమి ?

మహా:-మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము మనస్సునకు స్థానము కంఠముయొక్క మధ్యప్రదేశమును, బుద్ధికి ముఖమును, చిత్తమునకు నాభియును అహంకారమునకు హృదయమునుస్థానములు. ఈ అంతఃకరణచతుష్టయమునకు, ప్రయోజనములు - సంశయము, నిశ్చయము, ధారణము, అభిమానము.

నార:-ప్రాణాది పంచవాయువు లనఁగ నేమి ?

మహా:- ప్రాణరూపము, అపానరూపము, వ్యానరూపము ఉదానరూపము, సమానరూపము, వీనికి స్థానభేదములు వివరించి చెప్పఁబడుచున్నవి.

శ్లో॥ హృదిప్రాణో గుదేఽపానస్సమానో నాభి సంస్థితః
ఉదానః కంఠదేశ స్థో వ్యానస్సర్వశరీరగః''

అనఁగా హృదయమునందు ప్రాణవాయువును గుదమందు అపానవాయువును, నాభియందు సమానవాయువును, కంఠమందు ఉదానవాయువును, యావచ్ఛరీరమందు సమాన వాయువును ఉండును అని అర్థము. వానికిం బ్రయోజనము లేవియన- ప్రాణము పైటికిఁబోవునది. అపానము అధోమార్గముగ పోవునది. ఉదానము, ఊర్ధ్వముగబోవునది. సమానము జీర్ణమునుజేయునది. వ్యానము అంతటను వ్యాపించునది. వీని కుపవాయువు లయిదుగలవు. నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అనుపేర్లుగలవి. వానికిఁ బ్రయోజనము లేవియన ?

శ్లో॥ "నాగా దుద్గిరణం చాపి కూర్మా దున్మీలనంతథా
ధనంజయా త్పోషణంచ,

దేవదత్తాచ్చ జృంభణం కృకరాచ్చ క్షుతంజాతం
ఇతి వేదవిదో విదుః

అనఁగా - నాగము ఉద్గీర్ణము (ఎక్కిళ్లు) కలుగజేయునది కూర్మము ఉన్మీలనము (మెలకువ) కలుగజేయునది. ధనంజయము పోషణము చేయునది. దేవదత్తము జృంభణము (ఆవులింత) కలుగజేయునది. కృకరము క్షుతం (తుమ్ము) కలుగజేయునది). ఆ జ్ఞానేంద్రియము మొదలగువాని కధిపతులు దిక్కు వాయువు మొదలగు వారై యున్నారు.

దిక్కు - వాయువు-సూర్యుడు - వరుణుడు- అశ్వినీదేవతలు - అగ్ని - ఇంద్రుడు - ఉపేంద్రుడు, యముడు- బ్రహ్మ, చంద్రుడు- చతుర్ముఖబ్రహ్మ- క్షేత్రజ్ఞుడు - త్రిపురాంతకుడు (సాంబసదాశివుడు) విశిష్టుడు విశ్వకర్త - విశ్వయోని, అజుడు యుడు - వీరు క్రమముగా పాణ్యాదులకు దేవతలుగా మును చెప్పఁబడియున్నారు. ఈసమస్తము కలిసి లింగశరీరము ప్రాణములు, మనస్సు, బుద్ధి, దశేంద్రియములు వీనితో కొని యున్నదియును, పంచీకృతము కాని భూతముల డి పుట్టినదియు నైన సూక్ష్మశరీరము అనుభవించుటకు నమైనది. "లీనవ దర్థంగమయతి" (అణఁగియున్నట్టి అర్థ ను తోపించునది, అను వ్యుత్పత్త్యర్థము చేత లింగమని ప్పబడెను. ఎట్లు లీనమైన దానిని తోపించుననగా -శ్రవణ వన నాదులచేత తోపించజేయును, "శీర్యతే" అను శరీర పదముయొక్క వ్యుత్పత్తిచేత శరీరమని చెప్పబడుచున్నది, ఎట్లు శీర్యతే (జీర్ణమైపోవుట) యంటివేని "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మనైతిని) అను బ్రహ్మాత్మైక్య జ్ఞానము చేత, (జీవాత్మ పరమాత్మలు - ఒకటే అను జ్ఞానముచేత) జీర్ణమై

పోవుచున్నది. "దిహ ఉపచయే" అను వ్యుత్పత్తిచేతను "దహ భస్మీకరణే" అను వ్యుత్పత్తిచేతను, లింగదేహము నకు వృద్ధియు, ముందు కాగల క్షయమును జెప్పబడుచున్నది. ఎట్లనిన- రాగాద్యాకారముల చేత గలిగిన వికారము వృద్ధి, అట్టివృద్ధి తగ్గిపోవుటయే జీర్ణత యనఁబడును.

నార:-కారణ శరీరమనఁగ నేమి ?

మహా:-స్థూల, సూక్ష్మశరీరములకు హేతువైనదియును, ఆది లేనిదియును ఇట్టిదని చెప్ప నలవికానిదియును చిదాభాసునితో గూడికొనియుండునది బ్రహ్మ ఆత్మ ఒకటేయనుజ్ఞానముచేత నశించునది. అదియే అజ్ఞాన మనఁబడును. అదియే కారణశరీరము. 'అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధిః' అని చెప్పఁబడెను. మూఁడు ఉపాధులకంటె వేఱైన యాత్మను తెలిసికొనునది. 'శీర్యతేతి' అను వ్యుత్పత్తిచేత శరీరమని చెప్పఁబడుచున్నది. అది యెట్లంటేని - పరమాత్మ జీవాత్మలు ఒకటే యను జ్ఞానముచేత నశించిపోవునది కనుకను 'దిహఉపచయే' 'దహభస్మీకరణే' అనువ్యుత్పత్తుల చేత వృద్ధియు, ముందు కాగల నాశనమును చెప్పబడుచున్నది. అనృతము, జడము, దుఃఖము, ఇవియే స్వరూపముగాగలదియని చెప్పబడెను.

నార:-అనృతమనఁగ నేమి ?

మహా:-మూఁడు కాలములయందు అనుభవింపబడు వస్తువు అనృతము.

నార:-జడ మనఁగ నేమి ?

మహా:-తన విషయమైనట్టియును, అన్యుని విషయమైనట్టియును జ్ఞానములేని వస్తువు జడమనఁబడును.

నార:-దుఃఖమనఁగ నేమి ?

మహా:-ఇష్టములేని వస్తువు దుఃఖ మనబడును. అనాత్మ సమష్టి వ్యష్టి స్వరూపమని చెప్పఁబడుచున్నది. సమష్టి వ్యష్టు లెట్లనఁగా - వనముసమష్టియై వృక్షము వ్యష్టియో, జన సమూహము సమష్టియై జనుడు వ్యష్టియో, ఆ ప్రకార ముగనే అనేక శరీరములు గలదియైనప్పుడు సమష్టి యని యును, ఒకే శరీరముగ నుండునపుడు వ్యష్టియనియు, జెప్పబడును.

నార:-అవస్థాత్రయ మనఁగ నేమి ?

మహా:-జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ.

నార:-జాగ్రత్తయనఁగ నేమి ?

మహా:-ఇంద్రియముల చేత అర్థములను గ్రహించుట అనఁగా మేలుకొను సమయము.

నార:-స్వప్నమనఁగ నేమి ?

మహా:-మేలుకొనుటవలన గలిగిన సంస్కారమువలన బుట్టిన విషయము.

నార:-సుషుప్తియనఁగ నేమి ?

మహా:-ఏ విషయముయొక్కయు జ్ఞానము లేకపోవుట, జాగ్ర దవస్థకును, స్థూలశరీరమునకును, అభిమానముగలవాఁడు

విశ్వుఁడును, స్వప్నావస్థకును, సూక్ష్మశరీరమునకును, అభిమానము గలవాఁడు తైజసుఁడును, సుషుప్త్యవస్థకును కారణశరీరమునకును అభిమానముగలవాఁడు ప్రాజ్ఞుడును అగును.

నార:-కోశపంచక మనగ నేమి ?

మహా:-అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము, అనునవి. అన్నమయము అన్న వికారమును, ప్రాణమయము ప్రాణ వికారమును, మనోమయము మనోవికారమును, విజ్ఞానమయము విజ్ఞాన వికారమును, ఆనందమయము ఆనందవికారమునై ఉన్నవి.

నార:-అన్నమయ కోశమను పేరుగలది స్థూలశరీర మెటులయ్యెను ?

మహా:-తల్లిదండ్రులచేత అన్నముభుజింపబడి అది శుక్ల రూపముగాను, శోణిత (నెత్తురు) రూపముగాను పరిణమించును. వాని సంయోగమువలననే దేహాకారముగ పరిణమించును. కోశము (ఒర)వలెనే కప్పియుండునదికనుక కోశమని చెప్పబడుచున్నది. అన్నవికారమైయుండి ఆత్మకు ఆచ్ఛాదనముగ నుండును.

నార:-అదియెట్లు ?

మహా:-పరిమితిలేని యాత్మను పరిమితిగల దానివలెను, జన్మము మొదలగు నాలు భావములయొక్క వికారము లేని యాత్మను జన్మము మొదలగునాలు భావములయొక్క వికారముగల దాని వలెను తాపత్రయము మొదలగునవి లేనియాత్మను

తాపత్రయము గల దానివలెను ఆచ్ఛాదించుచున్నది. అనగా కప్పుచున్నది. ఏప్రకారము ఒర ఖడ్గమును, ఊక బియ్యపుగింజలను, గ్రుడ్డు గర్భమును కప్పునో ఆప్రకారముగనే ఆత్మను అన్నమయకోశము కప్పుచున్నది.

నార:-ప్రాణమయకోశమనఁగ నేమి ?

మహా:-కర్మేంద్రియములు ౫. ప్రాణము మొదలుగాగల వాయువులు ఇవి యన్నియు గలసి ప్రాణమయ కోశమన బడుచున్నది. ప్రాణ కారణమై యుండి మాటలాడుట మొదలగునవి లేనియాత్మను మాటలాడు దానివలెను. దానము మొదలగునవి లేనియాత్మను దానముచేయు దానివలెను, పోవుట వచ్చుట యనునవి లేనియాత్మను పోవు వచ్చు దానివలెను, ఆఁకలి, దప్పిలేని యాత్మను, ఆకలి, దప్పి, కలదానివలెను, కప్పుచున్నది.

నార:-మనోమయకోశ మనఁగ నేమి ?

మహా:-జ్ఞానేంద్రియములు ౫. ను, మనస్సును యివియన్నియు గలసి మనోమయకోశమని చెప్పబడుచున్నది.

నార:-అదియెట్లో వివరించి నుడువగోరెద.

మహా:-మనో వికారమయ్యుండి సంశయము మొదలగునవి లేని యాత్మను సంశయాదులు గలదానివలెను, శోకము మోహము మొదలగునవి లేని యాత్మను చూచుట మొదలగునవి కలదాని వలెను కప్పుచున్నది.

నార:-విజ్ఞానమయ కోశమనఁగ నేమి ?

మహా:-జ్ఞానేంద్రియములు ౫ బుద్ధి ఇవి యన్నియు గలిసి విజ్ఞానమయకోశ మనఁబడుచున్నది.

నార:-అది యెట్లు ?

మహా:-విజ్ఞానవికారమై యుండి కర్త కాని యాత్మను కర్త వలెను తెలిసికొనని యాత్మను తెలిసికొను దానివలెను, నిశ్చయము లేని యాత్మను నిశ్చయము గలదానివలెను, మాంద్యము జాడ్యము మొదలగు నవి లేని యాత్మను మాంద్య జాడ్యాదులు కలదానివలెను కప్పుచున్నది.

నార:-ఆనందమయకోశమనఁగ నేమి ?

మహా:-ప్రియము, సంతోషము, అతిసంతోషము వీనియందు ప్రవర్తించు అజ్ఞానము ప్రధానముగాగల యంతఃకరణము ఆనందమయకోశమని చెప్పఁబడుచున్నది.

నార:-అది ఏలాగు ?

మహా:-ప్రియము, సంతోషము, అతిసంతోషము లేనియాత్మను ప్రియము, సంతోషము, అతిసంతోషము కలదానివలెను, అనుభవించునది కాని యాత్మను అనుభవించుదానివలెను మితిలేనిసుఖముగల యాత్మను మితిగల సుఖముగలయాత్మ వలెను, ఆచ్ఛాదించుచున్నది. ఆత్మకు మూఁడుశరీరముల కంటె విలక్షణత్వము (వేఱైయుండుట) చెప్పఁబడుచున్నది.

నార:-తాతగారూ, అది యెట్లు ?

మహా:-చిన్ని మనుమఁడా ? చెప్పెద వినుండు, శబ్దమువలనను, అర్థమువలనను ప్రతీతి వలనను విలక్షణత్వముకలదు.

నార:-అది యెట్లు తెలిసికొనగలను ?

మహా:-"సత్" అను శబ్దము, "అసత్" అను శబ్దముకాదు. 'అసత్' అను శబ్దము "సత్" అను శబ్దముకాదు. "చిత్" అను శబ్దము జడము అను శబ్దము కాదు. "జడము" అను శబ్దము "చిత్" అను శబ్దము కాదు దుఃఖ శబ్దము సుఖశబ్దముగాదు. సుఖశబ్దము దుఃఖశబ్దముకాదు, ఈ ప్రకారముగా శబ్దమునుబట్టి మూఁడు శరీరములకంటె విలక్షణత్వము చెప్పబడుచున్నది.

నార:-ఎట్లు ?

మహా:-ఉండనివస్తువు ఉండువస్తువుకాదు. ఉండువస్తువు ఉండనివస్తువుకాదు. మఱియొక సాధనములేకయే తనంతటతానే ప్రకాశించువస్తువు ప్రకాశింపనివస్తువుకాదు. ప్రకాశించువస్తువు మఱియొకసాధనము లేక తనంతటతానే ప్రకాశించువస్తువుకాదు. దుఃఖరూపమైనవస్తువు సుఖరూపమైన వస్తువుకాదు. సుఖరూపమైనవస్తువు దుఃఖరూపమైన వస్తువు కాదు. ఈవిధముగా అర్థమునుబట్టి ఆత్మకు మూఁడు శరీరములకంటె విలక్షణత్వము చెప్పబడును. ఇకబుద్ధినిబట్టి ఆత్మకు మూఁడుశరీరములకంటె విలక్షణత్వము చెప్పబడుచున్నది.

నార:-అదియెట్లు ?

మహా:-'సత్' విషయమైనబుద్ధి, 'అసత్' విషయమయినబుద్ధి, కాదు. 'అసత్' విషయమైనబుద్ధి 'సత్'విషయమైన బుద్ధి కాదు. 'చిత్'విషయమైనబుద్ధి జడవిషయమైన బుద్ధికాదు.

జడవిషయమైన బుద్ధి 'చిత్' విషయమైనబుద్ధి కాదు. సుఖ విషయమయినబుద్ధి దుఃఖవిషయమైన బుద్ధికాదు. దుఃఖ విషయమైనబుద్ధి సుఖవిషయమైన బుద్ధికాదు. ఈ ప్రకార ముగా ఆత్మకు మూఁడుశరీరములకంటె విలక్షణత్వము చెప్పఁబడినది. ఇఁక మూఁడవస్థలయందును సాక్షిత్వము చెప్పబడుచున్నది.

నార:-ఎట్లు ?

మహా:-జాగ్రదవస్థ పుట్టినది. జాగ్రదవస్థ వచ్చుచున్నది. జాగ్రదవస్థ రాగలదు. స్వప్నావస్థ పుట్టినది. స్వప్నావస్థ వచ్చుచున్నది. స్వప్నావస్థ రాగలదు, సుషుప్త్యవస్థ పుట్టి నది. సుషుప్త్యవస్థ వచ్చుచున్నది. సుషుప్త్యవస్థ రాగలదు? ఈ ప్రకారముగా మూఁడవస్థలను తనకు వికారము లేకుండ తెలిసికొనుచున్నది. అందువలన ఆత్మకు పంచ కోశముల కంటె విలక్షణత్వము దృష్టాంతరూపముగఁ బ్రతిపాదింపఁబడుచున్నది. "ఈ గోవునాది, ఈ వత్సనాది, వీడు నా కుమారుడు, ఈమె నా కొమార్తె ఈమె నా స్త్రీ," ఈ మొదలైన పదార్థములుకల పురుషుఁడు ఆ పదార్థములు తాను కాడు, వానినుండి యే ప్రకార ముగ, నా అన్నమయ కోశము నా ప్రాణమయకోశము - నా మనోమయ కోశము నా విజ్ఞానమయకోశము, నా ఆనందమయ కోశము, అని ఈ ప్రకారముగా ౫ కోశ ములు గల యాత్మపంచకోశములు మొదలైనదికాదు, దానినుండి విలక్షణమై సాక్షియైయున్నది. "అశబ్దమస్పర్శ మరూపమవ్యయం తథారసం నిత్య సుగంధవచ్చ యత్,,

అనాద్యనంతం సనుతః పరం ధ్రువం" అని శ్రుతి ప్రమాణము. అనఁగా శబ్దము లేనిది, స్పర్శము లేనిది, రూపము లేనిది, నాశములేనిది, రసము లేనిది, నిత్యమైనది, గంధము లేనిది, ఆదిలేనిది, అంతములేనిది, మహత్తుకంటె వేఱైనది నిశ్చయమైనది, ఆత్మ" అని యర్థము. ఆకారణమువలన సచ్చిదానంద రూపత్వము చెప్పబడినది.

నార:-సద్రూపమనఁగ నేమి ?

మహా:-దేనిచేతను బాధింప బడకుండుటచేత మూఁడు కారణములయందును ఏకరీతిగానే యుండుట అని చెప్పబడుచున్నది.

నార:-చిద్రూపమనఁగ నేమి ?

మహా:- మఱియొక సాధనముయొక్క అపేక్షలేక తనంతట తాను ప్రకాశించు చున్నదియై తనయం దారోపింపబడిన సమస్త పదార్థములను బ్రకాశింపజేయుచు తాను నిజమై యుండుట చిద్రూపత్వమని చెప్పబడుచున్నది.

నార:-ఆనందరూపత్వ మనగఁ నేమి ?

మహా:-ఉత్కృష్టమైన ప్రేమకు స్థానమైయుండుట, నిత్యమై, యింతకంటె నతిశయము లేక యుండుట, ఆనందరూపత్వమని చెప్పబడుచున్నది "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మవిజ్ఞానమానందం బ్రహ్మ రాతేర్దాతుః పరాయణం" అని శ్రుతి ప్రమాణము, అనగా బ్రహ్మ సత్య స్వరూపుడును, జ్ఞాన స్వరూపుడును, అంతము లేనివాఁడును, బ్రహ్మ విజ్ఞాన (విశేషజ్ఞానము) స్వరూపుడును, ఆనంద స్వరూపుడును నై

యున్నాడు. "రాతేర్దాతుః పరాయణం" కర్తృత్వము వలన హేతువైన బ్రహ్మకు (చతుర్ముఖ బ్రహ్మకు) ఆశ్రయమైన వాడు. అనియర్థము.

ఈ ప్రకారముగా నిత్యమైనట్టియు, పరిశుద్ధమైనట్టియు, జ్ఞానముతో గూడినట్టియు, ముక్తితో గూడినట్టియు, స్వభావమైనట్టియు, బ్రహ్మము నేనై తిని. అని సంశయము లేకను, వాదము లేకను, తప్పుఅభిప్రాయము లేకను, ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు బ్రతికియుండియును ముక్తుండగుచున్నాడు.

నారః-షట్చక్రలక్షణము నిరూపింపుడు.

మహాః-(౧) యోనిస్థానమందు "మూలాధార చక్రము" రక్తవర్ణమైన నాలుగుదళములును వశషస అనెడి స్వర్ణమయమైన నాలుగు అక్షరములును గలది. ఈ కమలముయొక్క కర్ణిక (దుద్దు) లో చతుష్కోణము గలదియును, ఎనిమిది శూలములచే ఆవరింపబడినదియును, పసుపురంగు గలదియును నగు భూమండలమున్నది. దాని మధ్యమందు నాలుగు భుజములుగలదియును, చేతియందు వజ్రాయుధమును ధరించినదియును, ఐరావతము నెక్కినదియును, బంగారు రంగుగలదియును నగు లం - ణం అనెడి భూమి బీజమున్నది. ఆ బీజమైన బిందుమధ్యమునందు చతుర్ముఖములును, చతుర్భుజములును గలిగినవాడును, దండము, కమండలము, అక్షమాలిక, అభయము అనువానిని ధరించినవాడును నగు శిశుస్వరూపమైన బ్రహ్మ యున్నాడు. ఆ రక్తపద్మమునందు రక్తవర్ణముగలదియును, చతుర్భుజ

ములుగలదియును, శూలము, ఖట్వాంగము, క్రకచము, (అంపము)పానపాత్రము అను వీనిని చేతులయందు ధరించి నదియును నగు చక్రమును నడిపించునట్టి ఢాకినీ శక్తి యున్నది. కర్ణికామధ్యమునందు మెఱుపు స్వరూపమైన త్రికోణమున్నది. దాని మధ్యమందు కామవాయువును రక్తవర్ణ కామబీజమును నున్నది. దానిమీద నల్లనిరంగు గల స్వయంభులింగమున్నది. దానిమీద మూడున్నర వలయ స్వరూపమైయుండు కుండలినీశక్తియున్నది. దాని మీఁదిలింగముమీఁద దండాకారముగ చిత్కళయున్నది.

(౨) లింగమూలమునందు గల "స్వాధిష్ఠాన చక్రము" మెఱుమువంటి ప్రకాశముగల బిందువుతోఁ గూడిన బ భ మ య ర ల, అనెడి ఆఱక్షరములుగల సిందూర వర్ణమైన ఆఱు దళములతోఁ గూడినదిగా నున్నది. ఆకర్ణికయందు అర్ధచంద్ర స్వరూపమైన యెనిమిది దళములుగల తెల్లనైన జలమండల మున్నది. దానిమధ్యమందు పాశమును చేత ధరించినదియును, మకరవాహనాధిష్ఠిత మైనదియును నగు వం అనెడి అప్పు బీజమున్నది. దాని మధ్యమందు విష్ణువు చతుర్భుజుఁడై శంఖ చక్రగదా పద్మధారియై, పీతాంబరుఁడై, వనమాల, శ్రీవత్సము, కౌస్తుభము అనువానిని ధరించినవాఁడై, గరుడారూఢుఁడై యౌవనస్వరూపుడై యున్నాఁడు. ఆకర్ణికయందు రక్తపద్మము మీఁద కృష్ణవర్ణమును చతుర్భుజములును, త్రిలోచనములును మూఁడు నేత్రములు, వక్రదంతములును భయంకర స్వరూప మును గల 'రాకిని' యనెడి శక్తి శ్వేతాన్నము నందును రక్త ధారయందును ప్రియముగలదై శూలము, శంఖము, డమరుకము, ఉలి వీనిని చేతులందు ధరించియున్నది.

(3) నాభిస్థానమందుగల "మణిపూరకము" మేఘచ్ఛాయగలదియై డ ఢ ణ త థ ద ధ న ప ఫ అను పది యక్షరములతో గూడిన పది దళములు గలదియై యున్నది. ఆకర్ణికయందు త్రికోణాకృతియును, ఆ త్రికోణమునకు బయట మూఁడుస్వస్తికములతో గూడినదియును, (ఊర్ధ్వమైన నాలుగు కడపలు గలరెండు రేఖలు స్వస్తికమనఁబడును.) రక్తవర్ణము గలదియును నగు అగ్నిమండలమున్నది. దాని మధ్యమందు చతుర్భుజములు గలదియును, వజ్రము, శక్తి, వరము, అభయము అనువానిని ధరించినదియును, మేషవాహనారూఢయైనదియుననగు రం అనెడి అగ్నిబీజమున్నది. దానియందు వృషభారూఢుఁడును, రక్తకాంతి గలవాడును, రెండుభుజములుగలవాఁడును వరము, అభయము అనువానిని ధరించినవాఁడును శ్వేతభస్మము, శ్వేతాభరణము మొదలగు వానిచే తెల్లగాఁజేసికొనబడిన దేహము కలవాడును, వృద్ధస్వరూపుఁడును నైనరుద్రుఁడున్నాఁడు, కర్ణికయందలి రక్తపద్మమునందు త్రిముఖము, త్రినేత్రము. చతుర్భుజము, వక్రదంతములు అనునవిగలదియును, కృష్ణవర్ణమైనదియును, వజ్రము, శక్తి, అభయము, వరము అను వీనినిధరించినదియును, రక్తముతోఁగూడిన కేసరాన్నము, మాంసము అనువానిని అభిలషించినదియుననగు "లాకిని" అనెడి శక్తియున్నది.

(4) హృదయస్థానమందు గల "అనాహత చక్రము" దాసనపుష్పమువంటి సిందూరవర్ణముగల బిందువుతోఁగూడిన క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ అను ద్వాదశాక్షరములతో గూడినట్టి ద్వాదశదళములు గలిగి యున్నది. ఆకర్ణికయందు ధూమ్రము (పొగ) వర్ణము గల షట్కోణాకృతియైన వాయు

యును, పాశము, అంకుశము, ధనుస్సు, బాణము అను వానిని హస్తములందు ధరించినదియునునై యున్నది.

(౬) భ్రూమధ్యమందలి "ఆజ్ఞాచక్రము" చిత్రవర్ణము గల హ, క్ష యనెడి రెండక్షరములతోఁ గూడినట్టి శ్వేతకాంతియైన రెండు దళములు గలది. కర్ణికమధ్యమునందు చక్రమును నడిపించునట్టి "హాకిని" యనెడి శక్తి శ్వేతవర్ణము కలదియును, రక్తకాంతి గల ఆఱుముఖములును, మూఁడు కన్నులును, ఆఱుభుజములును గలదియును, వరము, అభయము, అక్షమాల, కపాలము, డమరుకము, పుస్తకము అనువానిని ధరించినదియును, శుక్ల పద్మమునకు మీఁద వసించునదియునునై యున్నది. త్రికోణమునందు విద్యుత్కాంతి (మెఱుమురంగు) వలె శ్వేతవర్ణమైన "హితా" అనెడి లింగమున్నది. దాని మీఁద త్రికోణమునందు ప్రణవ స్వరూపమైన అంతరాత్మ దీపము వంటి జ్యోతియైయున్నది. దాని చతుర్దిక్కులయందును, అంతరిక్షమునందు విస్ఫులింగ బింబములచే ఆవృతమైనదియును, జ్వలించుచుండెడి దీపమువంటి తనయొక్క తేజస్సు వలన మూలము మొదలు బ్రహ్మరంధ్రమువఱకును ప్రకాశించునదియునునైన జ్యోతియున్నది. దానిమీఁద సూక్ష్మస్వరూపమైన మనస్సున్నది. దానిమీఁద చంద్రమండలమునందు శక్తితోఁగూడిన 'హంస'మనెడి పరమశివమున్నది. దీనికి మీఁద కారణ- అవాంతరశరీరమును సహస్రదళకమలము మొదలగు వాని స్థానమును, స్వరూపము మొదలగునవియు నున్నవి.

మఱియు నీషడాధారలక్షణము గ్రంథాదులందు వేఱు వేఱుగాఁ జెప్పబడియున్నది. ఇది షట్చక్ర నిరూపణము.

సార:- శ్లో॥ "నమశ్శివాయ గురవే నాదబిన్దు కలాత్మనే।
నిరఞ్జనే పదంయాతి నిత్యం యత్రపరాయణః"

తా॥ శివ (సుఖ) స్వరూపమైన లేక ఈశ్వరభిన్నమైన గురువునకు లేక సర్వాంతర్యామి స్థితిచే సకల జగములకును, ఉపదేశించు శివుఁడనెడి ఈశ్వరుఁడైన నాదబిందు స్వరూపుడైన గురువునకు నమస్కారము. వారియెడల (నాదబిందు కలాత్మక స్వరూపమైన శివమును గురువునెడల) ప్రతిదినమును స్మరణగల పురుషుఁడు నిరంజన (అంజనమనెడి మాయోపాధి లేని) పదమైన బ్రహ్మమును బొందుచున్నాఁడు.

"నమస్తే నాథభగవన్ శివాయ గురురూపిణే!" శివయనెడి గురు స్వరూపమైన భగవంతుఁడా! నాథుఁడా! నీకు నమస్కారము, అనుదానివలన ఈశ్వరభిన్నుఁడు గురువని చెప్పఁబడెను. "సఏషపూర్వేషామపి గురుః,కాలేనాఽనవచ్ఛేదాత్" అతఁడు (ఈశ్వరుఁడు) త్రికాలాఽబాధ్యుండగుటచేత బ్రహ్మాదులగువారికి గూడ గురువు (ఉపదేశకర్త)గా నున్నాఁడు. అని పాతంజల యోగశాస్త్రమునందు చెప్పఁబడి యున్నది. నాదమనఁగా కంచుగంట మ్రోగునట్లు కలుగు దీర్ఘమైన ధ్వని బిందువనఁగా అనుస్వారమునకు (బిందువునకు) తర్వాత కలుగునట్టిధ్వని. కల అనఁగా నాదముయొక్క ఏకదేశము నాదబిందు కలాత్మకస్వరూపమైన శివుఁడనెడి గురువనఁగా నాదానుసంధానము గలవాఁడని భావము. పూర్వపాదముచేత గురువునకును శివునకును అభేదము సూచింపఁబడినది. అని, స్వామీ, వైకుంఠ శ్రీ కంఠా? సెలవిచ్చియుంటిరి. అది సమాధివలన గలుగునంటిరి. ఆ సమాధియెట్లు? ఎన్నివిధములు? మొద

లగు సంగతి సందర్భములు ఆనతీయ వేడెద. స్వామీ నమ స్కారము. గురుమూర్తీ? నమస్కారము. వేదవేద్యా, నమస్కారము.
శ్రీమహా:- ప్రియశిష్యా! నారదా! పాత్రా! నుడివెద అవధారు (వినుము)

---

## సమాధిక్రమము

శ్లో॥ అథేదానీం ప్రవక్ష్యామి సమాధిక్రమముత్తమమ్
మృత్యుఘ్నంచసుఖోపాయం బ్రహ్మానందకరం పరం॥

తా॥ తరువాత కోటి సమాధి క్రమముల యందు ఉత్కృష్టమైనందువలన ఉత్తమమనియు, స్వేచ్ఛగా దేహ మును విడుచునట్టి స్థితినిగలుగ జేయుటవలన మృత్యువును నశింపజేయునది యనియును తత్త్వజ్ఞానోదయముచేతను మనో నాశ వాసనాక్షయములచేతను జీవన్ముక్తి సుఖమును బొందు టకు సాధనమగుటవలన సుఖోపాయమనియు, ప్రారబ్ధకర్మము క్షయమగునప్పుడు జీవబ్రహ్మలయొక్క అభేదముచేత అత్యంత బ్రహ్మానంద ప్రాప్తియైన విదేహముక్తి కలుగుటవలన పర బ్రహ్మానందమును నొసంగునది యనియును, చెప్పఁబడెను. ఇందు శాంత, ఘోర, మూఢముల నెడి చిత్తముయొక్క సకల వృత్తులును సంస్కారముతోగూడ సమాధిచేత నిరోధమగు నప్పుడు ("జీవన్నే వేహ విద్వాన్ హర్ష శోకాభ్యాం విము చ్యతే". విద్వాంసుడు (బ్రహ్మజ్ఞాని) ఇచ్చట జీవునితోగూడ నుండియే సుఖదుఃఖములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. అను వేదవాక్యము ప్రకారము చెప్పినట్టు నిర్వికార స్వరూపము

నందు నిలుచునట్టి జీవన్ముక్తి కలుగుచున్నది. పరముక్తి యను నది, ప్రాప్తించిన భోగములయొక్క అవసానావస్థయందు అంతఃకరణగుణములయొక్క ప్రళయము (నాశనము) వలన ఔపాధికరూపాత్యంత నివృత్తియందు అత్యంత స్వరూపావస్థానమైన (స్వరూపస్థితియైన) ప్రళయమువలన సిద్ధించుచున్నది. మేలుకొలుపును నిరోధించు సమాధి సంస్కారములు మనస్సునందు లయమగుచున్నవి. మనస్సు అస్మితయందును, అస్మిత మహత్తునందును, మహత్తు ప్రధానమునందును, ఈ ప్రకారముగా చిత్తగుణములయొక్క ప్రతి సర్గము (తమ యొక్క కారణమందు లయమగుట) కలుగుచున్నది. అట్లయినచో జీవన్ముక్తునికి మేలుకొలుపు కాలమందు "నేను బ్రాహ్మణుఁడను". "నేను మనుష్యుఁడను" అనెడి వ్యవహారము గోచరమగుటచేత చిత్తము మొదలగువాని వలన ఔపాధికస్థితి కలుగుటంబట్టి చింతపండుచేత పాలకు చెఱుపు కలిగినట్లు స్వరూపమునకు చెఱుపు కలుగునుకదా యనఁగా అట్లుకలుగదు. సంప్రజ్ఞాత సమాధియందు అనుభవింపఁబడిన ఆత్మసంస్కారము యథార్థ (తాత్త్విక) మనెడి నిశ్చయముండుటవలనను, అయథార్థమైన అన్యథాభావము (అన్యథాస్థితి) అవికారిత్వ - అప్రయోజకముగా నుండుటవలనను, చింతపండుచేత పాలు పెరుగగునను దృష్టాంతము వేఱుపడుట వలనను, పురుషునకు అంతఃకరణోపాధిగల నేను బ్రాహ్మణుఁడను అనెడి వ్యవహారము స్ఫటికమునకు ముంకెన (దాసన) పుష్పముయొక్క సన్నిధానమైన ఉపాధి స్వరూపమువలె యథార్థము కాదు. దాసన పుష్పము పోయిన కాలమునందు స్ఫటికమునకు స్వస్వరూపస్థితి మాఱుబాటు చెందనియట్లు

పురుషునకు అంతఃకరణముయొక్క సకల వృత్తులును నిరోధమైన కాలమునందు చెఱుపు కలుగకయే యుండును.

---

## సమాధి పర్యాయ పదములు

శ్లో॥ "రాజయోగ స్సమాధిశ్చ ఉన్మనీచ మనోన్మనీ।
అమరత్వం లయ స్తత్త్వం శూన్యాశూన్యం పరంపదం॥

శ్లో॥ "అమనస్కం తథాఽద్వైతం నిరాలమ్బం నిరఞ్జనం।
జీవన్ముక్తిశ్చ సహజా తుర్యాచే త్యేకవాచకాః॥"

తా॥ రాజయోగము, సమాధి, ఉన్మని, మనోన్మని, అమరత్వము, లయము, తత్త్వము, శూన్యాశూన్యము, పరమపదము, అమనస్కము, అద్వైతము, నిరాలంబము, నిరంజనము, జీవన్ముక్తి, సహజము, తుర్యము, అనునివి యన్నియును సమాధినామములు.

---

## సమాధి లక్షణము

శ్లో॥ సలిలే సైన్ధవం యద్వత్సామ్యం భవతియోగతః
తథాచ మనసోరైక్యం సమాధి రభిధీయతే॥"

శ్లో॥ యదాసంక్షీయతే ప్రాణో మానసంచ ప్రలీయతే
తదా సమరసత్వంచ సమాధిరభిధీయతే॥"

శ్లో॥ "తత్సమంచ ద్వయోరైక్యం జీవాత్మ పరమాత్మనోః
ప్రణష్ట సర్వసంకల్పః సమాధి స్సోఽభిధీయతే."

తా॥ జలమునందు ఉప్పు చేరుటవలన నెట్లు నీటియొక్క సామ్యమును (ఐక్యమును) బొందుచున్నదో, అట్లు ఆత్మకును

మనస్సునకును గలుగునట్టి యైక్యము సమాధి యనఁబడును. ఎప్పుడు ప్రాణము లణగిపోయి మనస్సును అణఁగుచున్నదో, అప్పుడు కలుగు సమరసత్వము సమాధియనఁబడును. జీవాత్మ పరమాత్మలనెడి రెంటియొక్క ఐక్యముగు సంబంధము కలిగి సకల సంకల్పములును నష్టమగుటయు, సమాధియనఁబడును.

---

## రాజయోగమహిమ

శ్లో॥ "రాజయోగస్య మాహాత్మ్యం । కో విజానాతి తత్త్వతః
జ్ఞానం ముక్తిః స్థితిః సిద్ధి ర్గురువాక్యేన లభ్యతే"

తా॥ రాజయోగ ప్రభావమును నిశ్చయముగా ఎవడు ఎఱుఁగును? అనఁగా ఒకఁడును తెలియఁడు. రాజయోగము చేత స్వరూపాఽపరోక్షానుభవమైన జ్ఞానమును, విదేహ ముక్తియును, నిర్వికారస్వరూప స్థితియును, అణిమాదిసిద్ధులును గురువాక్యముచేతఁ బొందఁబడుచున్నవి.

"పూర్వాచరితపుణ్యేన లబ్ధ్వాజ్ఞానం గురోర్ముఖాత్" పూర్వమాచరించిన అనఁగా వెనుకటి జన్మలయందుచేసిన, పుణ్యముచేత సాధనచతుష్టయమును సాధించుట యనెడి ప్రథమాభ్యాసమును పూర్వపుణ్యముచేత, గురువునుండి జ్ఞానము లభ్యమగుచున్నది. అని నారాయణ సంహితయందును, "యథాజన్మాంధస్య స్వరూపజ్ఞానం నవిద్యతే తథాగురూప దేశేనవినా కల్పకోటి శతైరపి తత్త్వజ్ఞానం నజాయతే, అనఁగా జాత్యంధునకుఁ బుట్టుగ్రుడ్డికి, వస్తువులయొక్క స్వరూపజ్ఞాన మెట్లు తెలియదో అట్లే గురూపదేశములేక నూఱుకోటి

కల్పకాలములు యత్నించినను తత్త్వజ్ఞానము కలుగనేరదు, అని మహానారాయణోపనిషత్తు నందును, చెప్పఁబడియున్నది.

శ్లో॥ "దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనం
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాంవినా॥"

తా॥ సద్గురువుయొక్క కృప లేనియెడల దారాది ఇహలోకమునందలివియును, అమృతాది పరలోకమునందలివియును నగు) విషయములయొక్క త్యాగమును, (భోగేచ్ఛలేమియును, ఆత్మా పరోక్షానుభవమైన తత్త్వ దర్శనమును, (ఆత్మసాక్షాత్కారమును) తుర్యావస్థయనెడి సహజావస్థయునుదుర్లభము. (పొందశక్యముకాదు)

అథ విషయశబ్దస్య వ్యాఖ్యాస్యామః

శ్లో॥ విశేషేణ షిణ్వంతి అవబధ్నాతి ప్రమాతారం
స్వసంగే నేతి విషయః॥"

తమ సంగముచేత ప్రమాత విశేషముగా కట్టబడుట చేత విషయములనఁబడెను. గురుకృపచేత సమస్తమును సులభము అని భావము, ప్రమాతాదులను విచారసాగరమున విశేషముగా గనందగును.

శ్లో॥ "వివిధైరాసనైః కుమ్భైర్విచిత్రైః కరణైరపి
ప్రబుద్ధాయాం మహాశక్తౌ ప్రాణశూన్యే ప్రలీయతే"

తా॥ నానావిధ మత్స్యేంద్రాసనాది ఆసనములచేతను, నానావిధ కుంభములచేతను, నానావిధ హఠసిద్ధియందు మిక్కిలి ప్రయోజనములగు మహాముద్రాది, కరణములచేతను, కుండలియనెడి మహాశక్తి మేల్కొను నపుడు ప్రాణవాయువు శూన్యమనెడి బ్రహ్మ రంధ్రమునందు లయమగుచున్నది.

"విచిత్రైః" "వివిధైః" అనునది కాకాక్షిగోళక న్యాయము చేత రెండు స్థలములయందును అన్వయించును. వ్యాపారము లేమియే ప్రాణముయొక్క లయము (పరిళయము)
నార:-కాకాక్షిగోళక న్యాయమన నేమి?

మహా:-కాకాక్షిగోళకన్యాయ మనఁగా- కాకికిగల ఒక కను గ్రుడ్డే రెండు ప్రక్కల యందుండు గోళములయందు వచ్చును. అనఁగా, ఏప్రక్కతిరుగునో ఆప్రక్కకు ఆగ్రుడ్డు తిరిగివచ్చి చూపును నొసంగును.

నార:-కుండలీశక్తి ప్రబోధాదులును ముద్రానామ మహిమా దులు తెలుపగోరెదను.

మహా:- శ్లో॥ ప్రాణస్య శూన్యపదవీ తథారాజపదాయతే
తదాచిత్తం నిరాలమ్బం తదాకాలస్యవఞ్చనమ్॥"

తా॥ శూన్యపదవి యనెడి సుషుమ్న ప్రాణవాయువు యొక్క రాజమార్గముగా ఆచరింపబడుచున్నది. (సుఖముగా పోవుటవలన) అప్పుడు చిత్తము నిరాలంబ (నిర్విషయ) మగు చున్నది. అప్పుడు కాలుని జయించుటయు కలుగుచున్నది.

చిత్తము నిరాలంబనుగునప్పుడు యమునివలని భయము లేదు. అనఁగా ఇట్టియోగికి మరణము లేదని యభిప్రాయము. ఇంక సుషుమ్నా నాడియొక్క పర్యాయపదములు చెప్పబడు చున్నవి.

శ్లో॥ "సుషుమ్నా శూన్యపదవీ బ్రహ్మరన్ధ్రం మహాపథః
శ్మశానం శామ్భవీ మధ్యమార్గశ్చే త్యేకవాచకాః"

తా॥ సుషుమ్న, శూన్యపదవి, బ్రహ్మరంధ్రము, మహా పథము, శ్మశానము, శాంభవి, మధ్యమార్గము అనునివి ఏక వాచకములు, అనఁగా ఈ 8 న్ను సుషుమ్నకు పర్యాయ పదములు.

సకల ప్రయత్నముల చేతను కుండలిని యొక్క మేలు కొలుపును ఆచరింపవలయును.

---

## కుండలినీ ప్రబోధ విశేషము

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన ప్రబోధయితు మీశ్వరీమ్
బ్రహ్మద్వారము ఖేసుప్తాం ముద్రాభ్యాసంసమాచరేత్॥ "

తా॥ కాబట్టి (కుండలిబోధముచేతనే షట్చక్రభేదము మొదలగునవి కలుగుటచేత) పూర్ణప్రయత్నముతోడ బ్రహ్మ ద్వారముయొక్క (సచ్చిదానంద లక్షణబ్రహ్మమును బొందు టకు ఉపాయమైన సుషుమ్నయొక్క) ముఖమునందు (సుషు మ్నాద్వారమును ముఖముచే మూసికొని) నిద్రచేయుచున్న ఈశ్వరియైన కుండలిని మేలుకొలుపుటకు మహాముద్ర మొద లగునవి చక్కఁగా అభ్యసింపవలయును.

ఇక దశవిధ (పదిరకములైన) ముద్రాదులయొక్క నామములను జెప్పుచున్నాను.

శ్లో॥ మహాముద్రా మహాబన్ధో మహావేధశ్చ ఖేచరీ
ఉడ్యానం మూలబంధశ్చబన్ధో జాలన్ధరాఽభిధః
కరణీ విపరీతాఖ్యా వజ్రోలీ శక్తిచాలనమ్"

తా॥ మహాముద్ర, మహాబంధము, మహావేధము, ఖేచరి, ఉడ్యానము, మూలబంధము, జాలంధరబంధము, విపరీతకరణి, వజ్రోలి, శక్తిచాలనము అనునివి ముద్రలనఁబడును.

ముద్రాలక్షణము-ధ్యానబిందు, యోగకుండలి, యోగచూడామణి, యోగతత్త్వము మొదలైన యుపనిషత్తుల యందును, శివసంహిత, గోరక్ష సంహితలయందును చెప్పఁబడి యున్నది.

వాసిష్ఠమునందు "అపానమును సంకుచితము చేయుటయును, ప్రాణమును నిరోధించుటయును, కొండనాలుకమీఁద నాలుకను ఉంచుటయును యోగసాధనమగును" ఇది ఖేచరీ ముద్రాలక్షణము దశవిధముద్రలయొక్క ఫలమేమనఁగా ?

శ్లో॥ ఇదంహిముద్రాదశకం జరామరణ నాశనమ్
ఆదినాథోదితం దివ్య మష్టైశ్వర్య ప్రదాయకమ్॥
వల్లభం సర్వసిద్ధీనాం దుర్లభం మరుతామపి
గోపనీయం ప్రయత్నేన యథారత్నకరణ్డకమ్॥
కస్యచిన్నైవ వక్తవ్యం కులస్త్రీసురతం యథా॥ "

తా॥ ఈ దశవిధ (పది) ముద్రలు జరామరణములను బోగొట్టునవిగను, ఆదినాథులచే జెప్పబడినవిగను, ఆదినాథులనఁగా- షడర్ధలోచనుఁడైన సర్వసర్వేశ్వరుండని యర్థము. దివ్య (ఉత్తమ)మైనవిగను, అణిమాద్యష్టైశ్వర్యముల నిచ్చునవిగను, కపిలాది సకలసిద్ధులకును, ప్రియమైనవిగను, దేవతల చేతను బొందుటకు సాధ్యము కానివియును నై యున్నవి. ఇవి రత్నములబరిణివలె మిగుల ప్రయత్నముచేత దాఁచఁదగినవి. స్త్రీసంగమమువలె పరుల కెవరికిని చెప్పఁదగినవికావు.

## అష్టైశ్వర్యము లనగా

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనునవి.

౧. అణిమ:- సంకల్పమాత్రముచేత ప్రకృతిని (స్వభావమును) నశింపజేయుటవలన పరమాణువువలె శరీరము సూక్ష్మమగుట.

౨. మహిమ:- ప్రకృతిని పూరింపజేయుటవలన ఆకాశాదులవలె దేహము పెద్దది యగుట.

3. గరిమ:- మిగుల తేలికగానుండు దూది మొదలగునవి పర్వతము మొదలగు వానివలె బరువగుట.

४. లఘిమ:- మిగుల బరువుగల కొండ మొదలగునవి దూదివలె తేలికయగుట.

౫. ప్రాప్తి:- సర్వమును ఎదురుగా వచ్చుట.

౬. ప్రాకామ్యము:- భూమినందుండియే ఆకాశమందలి నక్షత్రములను తాకునట్లుగా కోరినదంతయు చేసికొనుట.

౭. ఈశత్వము:- జలమునందువలె భూమియందును మునుగుట, భూత భౌతికములను సృష్టించుట, రక్షించుట, సంహరించుట మొదలగునవి.

౮. వశిత్వము:- భూతభౌతికములను స్వాధీనము (వశము) చేసికొనుట.

---

## చంద్ర సూర్య విపరీత విధానము

శ్లో॥ "అధశ్శిరాశ్చోర్ధ్వపాదం క్షణంస్యాత్ప్రథమేదినే
క్షణాచ్చకిఞ్చి దధిక మభ్యసేచ్చ దినేదినే॥"

తా॥ భూమియందు శిరస్సునుంచి రెండు చేతులతో నడుమును పట్టుకొని భుజము మొదలు మోచేతులవఱకునైన భుజములతోను, మెడ, శిరస్సు వీనియొక్క వెనుకటి భాగము నందనెడి వానితోను భూమియందాన్చి, మీదుగా కాళ్ళను చాచి మొదటిదినము ఒకక్షణమును, ఇట్లు దినదినము ఒకొక్కక్క క్షణము అధికముగను ఉండవలయును.

---

## విపరీత కరణి గుణము

శ్లో॥ వలితం పలితంచైవ షణ్మాసోర్ధ్వం నదృశ్యతే
యామమాత్రంతు యోనిత్య మభ్యసేత్సతు కాలజిత్॥

తా॥ సాధకునియొక్క శరీరమునందు ఆఱు నెలలకు మీఁద సడలు నరలు కనఁబడవు. ఏసాధకుఁడు జాముసేపు ప్రతినిత్యమును అభ్యసించుచున్నాఁడో, వాఁడు యముని జయించినవాఁడగుచున్నాఁడు.

ఇందువలన యోగము ప్రారబ్ధకర్మమును ప్రతిబంధించుచున్నదనుట సూచింపఁబడినది.

శ్లో॥ స్వదేహారమ్భకస్యాపి కర్మణః సంక్షయావహః
యో యోగః పృథివీపాల శృణుతస్యాపిలక్షణమ్.

ఓ రాజా! తన శరీరమునకు కారణమైన కర్మమును నశింపఁజేయు యోగమేదియో దాని లక్షణమును వినుము, అని విష్ణుధర్మమునందు చెప్పబడియున్నది.

శ్లో॥ యథా ప్రారబ్ధకర్మ తత్త్వజ్ఞానా త్ప్రబలమ్
తథా తస్మాదపి కర్మణో యోగాభ్యాసః ప్రబలమ్
అతఏవ యోగీనా ముద్దాలక, వీతహవ్యాదీనాం
స్వేచ్ఛయా దేహత్యాగ ఉపపద్యతే"

ఎట్లు ప్రారబ్ధకర్మము తత్త్వజ్ఞానమునకన్న ప్రబలమో అట్లే ఆ కర్మముకంటె యోగాభ్యాసము ప్రబలము, కావున ఉద్దాలక వీతహవ్యులు మొదలగు యోగులకు స్వేచ్ఛగా తమ యిష్టప్రకారము, దేహమును విడుచుటతగును. అని విద్యారణ్య స్వాములచే జీవన్ముక్తి ప్రకరణమునందు చెప్పఁబడియున్నది.

"దేహం జహ్యాత్సమాధినా" సమాధిచేత దేహమును విడుచుచున్నాఁడు. అని శ్రీమద్భాగవతమునందును చెప్పఁబడియున్నది.

ఇఁక వజ్రోలియందు ప్రవృత్తిని గలుగఁజేయునిమిత్తమై తత్ఫలమును వ్యక్తీకరించుచున్నాను.

---

## వజ్రోలీమహిమ

శ్లో॥ స్వేచ్ఛయా వర్తమానోఽపి యోగోక్తైర్నియమైర్వినా
వజ్రోలీం యోవిజానాతి సయోగీసిద్ధభాజనమ్॥"

తా. ఎవఁడు (ఏఅభ్యాసి) వజ్రోలి ముద్రను విశేషముగా స్వానుభవముచేతఁ దెలియుచున్నాఁడో, ఆయోగి యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడిన బ్రహ్మచర్యాది నియమములు లేకయే స్వేచ్ఛగా నుండినను, అణిమాది సిద్ధులకు పాత్రుఁ (అణిమాద్యష్టైశ్వర్యములు కలవాఁ) డగుచున్నాఁడు.

వజ్రోలిసాధనమునకు వలయు రెండు వస్తువులను చెప్పెద.

శ్లో॥ తత్రవస్తుద్వయంవక్ష్యే దుర్లభంయస్యకస్యచిత్
క్షీరంచైకం ద్వితీయంతు నారీచవశవర్తినీ॥

తా. వజ్రోలీ సాధనమందు ఉపయుక్తములైనవి రెండు. అవి (ధనములేని) వానికి దుర్లభము. ఒకటి (త్రాగుటకొఱకు) పాలు. మఱొకటి స్వాధీనమైన స్త్రీ. సంభోగానంతరము ఇంద్రియము బలహీనము గలది యగుటచేత బలము కొఱకై పాలు త్రాగవలయును. కొందఱు పాలు త్రాగుటను అభ్యాస కాలమందు ఆకర్షణముచేయుట కొఱకని చెప్పెదరు.

---

## వజ్రోలీ ముద్రాలక్షణము

శ్లో॥ మేహనేనశనైస్సమ్యగూర్ధ్వాకుఞ్చనమభ్యసేత్
పురుషోప్యథవానారీ వజ్రోలీసిద్ధిమాప్నుయాత్॥

తా. బిందువు బయలు వడుటకు సాధనమైన సంభోగానంతరము పురుషుఁడైనను, స్త్రీయైనను, మెల్లగా చక్కఁగా యత్నపూర్వకముగా గుహ్యస్థానమును లాగుటకు (బిందువును మీఁదికి గ్రహించుటను) చేయ వలయును. అందువలన వజ్రోలిముద్రయొక్క సిద్ధిని బొందుదురు.

వజ్రోలివలన బిందువు సిద్ధించుటకు సులభమైన యుపాయము "శివసంహితయందు" చెప్పఁబడి యున్నది. ఎట్లనఁగా తాను మూత్రము వదలు నప్పుడు దానిని వాయువుచేత బలముగా మీఁదికిలాగి కొంచెము కొంచెముగా విడువ వలయును. మఱల గురూపదేశ ప్రకారము మీఁదికి లాఁగవల

యును. ఇట్లు ఆఱునెలలు ప్రతిదినమును అభ్యసించిన యెడల మహాసిద్ధిని యొసంగు బిందుసిద్ధికల్గును. నూఱుగురు యువతులతో గూడినను బిందువు నశింపదు. తరువాత—

శ్లో॥ నారీభగేపతద్బిన్దుం మభ్యాసేనోర్ధ్వమాహరేత్

తా॥ రతికాలమునందు స్త్రీ చిహ్నమునందు బిందు పతనమునకుముందే బిందువును గ్రహింపని యెడల, బిందు పతనమైన యనంతరమైనను గ్రహింపవలయును.

శ్లో॥ "చలితంచ నిజంబిన్దు మూర్ధ్వమాకృష్య రక్షయేత్"

చకారమువలన తనబిందువుతో స్త్రీయొక్క శోణితమును గ్రహింపవలయును.

---

## వజ్రోలీగుణః కథ్యతే

శ్లో॥ ఏవం సంరక్షయేద్బిన్దుం మృత్యుం జయతియోగవిత్
మరణం బిందుపాతేన జీవనం బిందుధారణాత్॥

తా. ఇట్లు బిందువును రక్షించుకొను యోగవేత్త మృత్యువును జయించుచున్నాఁడు. బిందు స్ఖలనము వలన మరణమును, బిందు ధారణమువలన జీవనమును కలుగుటంబట్టి బిందువును రక్షింపవలయును.

శ్లో॥ సుగన్ధోయోగినాందేహే జాయతేబిన్దుధారణాత్
యావద్బిన్దుః స్థిరోదేహే తావత్కాలగ భయంకుతః॥

తా॥ వజ్రోలి అభ్యాసకులైన యోగిజనముయొక్క దేహమందు బిందు ధారణముచేత సుగంధము (పరిమళము) కలుగుచున్నది. ఎంతకాలము దేహమునందు బిందువు నిలిచి

యుండునో అంతకాలము వఱకును వారికి మృత్యుభయము లేదు.

శ్లో॥ చిత్తాయత్తం నృణాం శుక్రం శుక్రాయత్తంచ జీవితం
తస్మాచ్ఛుక్రం మనశ్చైవ రక్షణీయం ప్రయత్నతః.

తా. పురుషులయొక్క శుక్లము (చిత్తము చలించిన యెడల చలించుచున్నది. చిత్తముస్థిరపడినచో నిలుచునదియగు చున్నందువలన) చిత్తాధీనమైయున్నది. శుక్లము నిలిచినయెడల జీవనమును, శుక్లమునష్టమైనయెడల మరణమునుకలుగుటవలన జీవనము శుక్లాధీనమైయున్నది. కావున శుక్లమును మనస్సును ప్రయత్నము చేత రక్షింపవలయును. అవశ్యముగా బిందువును రక్షింపవలయును.)

శ్లో॥ ఋతుమత్యా రజోఽప్యేవం నిజం బిన్దుంచ రక్షయేత్"

తా. ఇట్లు మున్ను చెప్పబడిన అభ్యాసమువలన, ఋతుస్నానము చేసిన స్త్రీయొక్క రజస్సును, తనయొక్క శుక్లమును రక్షింప (గ్రహింప = ఆకర్షింప = లాగ) వలయును.

శ్లో॥ "సహజోలి శ్చామరోలి ర్వజ్రోల్యా భేదయేకతః
జలేషుభస్మనిక్షిప్య దగ్ధగోమయసమ్భవమ్."

తా॥ సహజోలియును, అమరోలియును, ఒకే ఫలము గలవిగా నుండుటవలన, అవి వజ్రోలి భేదమగును, గోమయ మును కాల్చుటవలనఁ గలుగు మంచి విభూతిని జలము నందువైచి (జలముచేకలిపి) క్రింది శ్లోకముతో నన్వయము.

శ్లో॥ వజ్రోలీ మైథునాదూర్ధ్వం స్త్రీపుంసోః స్వాంగ లేపనమ్
ఆసీనయోః సుఖేనైవ ముక్తవ్యాపారయోః క్షణాత్".

తా॥ వజ్రోలి ముద్రానిమిత్తము సంభోగానంతరము క్షణము సేపు (రత్యుత్సవమున కనంతరము) ఉండి మఱలిన వ్యాపారముగల (రతిక్రియలేని) వారై, ఆనందముగానుండు నప్పుడు స్త్రీ పురుషులిద్దరును సుఖమైన అంగములందు (పైని చెప్పిన విభూతిని) పూసికొనవలయును. ఈ విభూతి ధారణమువలన శీతల, సన్నిపాతాది రోగములు నశించును, శిరస్సు, లలాటము, నేత్రము, హృదయము, భుజము, చేతులు అను నీచోటులందు విభూతిని లేపనము చేయవలయును.

శ్లో॥ అభ్యాసానిస్సృతాంచాన్ద్రీం విభూత్యాసహమిశ్రయేత్
ధారయేదుత్తమాంగేషు దివ్యదృష్టిః ప్రజాయతే॥

తా. అమరోలి అభ్యాసమువలన దూరదృష్టి (భూత భవిష్య ద్వర్తమాన కాలములయందు దాచఁబడినవియగు దూరమందలి పదార్థములు విశేషముగా గనదగుదృష్టి) మిక్కిలి కలుగుచున్నది.

అమరోలిని అభ్యాసము చేయు విధము శివాంబు కల్ప మందు గననగును. శివాంబు=అమరవారుణి.

పురుషుని వజ్రోలి సాధనము చెప్పితి. స్త్రీ యొక్క వజ్రోలీ సాధనమును గూడ చెప్పెదను.

## స్త్రీ వజ్రోలీ సాధనము

శ్లో॥ "పుంసోబిన్దుంసమాకుఞ్చ్య సమ్యగభ్యాసపాటవాత్
యదినారీరజోరక్షే ద్వజ్రోల్యాసాపియోగినీ"

తా. స్త్రీ యైనది చక్కగా అభ్యసించునట్టి అభ్యాసము వలన పురుషుని వీర్యమును జక్కగా గ్రహించి రజస్సును వజ్రోలి ముద్రచేత రక్షించునది యయ్యేనేని ఆ స్త్రీయును యోగిని (యోగవతి) యగుచున్నది.

## వజ్రోలీ గుణము

శ్లో॥ తస్యాఃకిఞ్చి ద్రజోనాశం నగచ్ఛతి నసంశయః
తస్యాః శరీరే నాదశ్చ బిన్దుతామేవగచ్ఛతి".

తా. (వజ్రోలి అభ్యాసము గల) ఆ స్త్రీయొక్క శోణితము అల్పమైనను నాశమొందుట (పడుట) లేదు. దీనికి సంశయములేదు. ఆ స్త్రీయొక్క శరీరమునందు నాదమును బిందుస్థితిని పొందుచున్నది. మూలాధారమునుండి లేచిన నాదము హృదయమునకు మీఁద బిందుస్థితిని బొందుచున్నది. (అనఁగా బిందువుతో నైక్యమగుచున్నది.)

శ్లో॥ "బీజంచపౌరుషం ప్రోక్తం రజశ్చ స్త్రీ సముద్భవం
అనయోర్బాహ్యయోగేన సృష్టిః సంజాయతే నృణాం"
"యదాభ్యంతరయోగస్స్యా త్తదాయోగీతి గీయతే
బిందుశ్చంద్రమయః ప్రోక్తో రజస్సూర్య మయంతథా"
అనయోస్సంగమాదేవ జాయతే పరమంపదం
స్వర్గదో మోక్షదో బిన్దుః ధర్మదో౽ధర్మద స్తథా ॥
తన్మధ్యే దేవతాస్సర్వాః తిష్ఠన్తేసూక్ష్మరూపితః ॥

బీజము (శుక్లము) పురుషునిది. రజస్సు (శోణితము) స్త్రీనుండి కలుగుచున్నది. ఈ రెండును బయట చేరుటవలన మనుష్యసృష్టి కలుగుచున్నది. ఎప్పుడు అంతరసంబంధము కలుగుచున్నదో అప్పుడు యోగి (యోగపురుషుడు) అనఁబడు

చున్నాఁడు. బిందువు (శుక్లము) చంద్రమయముగను, రజస్సు సూర్యమయముగను చెప్పబడుచున్నది. ఈ రెంటియొక్క సంబంధమువలననే పరమపదము కలుగుచున్నది. బిందువైనది స్వర్గము, మోక్షము, ధర్మము, అధర్మము అనువానిని కలిగించును. దాని మధ్యమందు సర్వసుపర్వులు (దేవతలందఱు), సూక్ష్మరూపముగా నున్నారు. అని 'అమృతసిద్ధి' యను గ్రంథమందు చెప్పబడియున్నది.

శ్లో॥ సబిన్దుస్త ద్రజశ్చైవ ఏకీభూయ స్వదేహగా
వజ్రోల్యభ్యాసయోగేన సర్వసిద్ధింప్రయచ్ఛతి.

తా. ఆ పురుషునియొక్క బిందువును, స్త్రీయొక్క శోణితమును, వజ్రోలి యభ్యాసముచేత ఏకమై శరీరమునందుండియే సకల సిద్ధులను కలుగ జేయుచున్నవి.

శ్లో॥ "రక్షేదాకుఞ్చనాదూర్ధ్వం యారజః సాహియోగినీ
అతీతానాగతంవేత్తి ఖేచరీచభవేద్ధ్రువం"

తా. ఏ స్త్రీ యోనిని సంకుచితము చేయుటచేత శోణితమును మీఁదికిఁ గొనిపోయి రక్షించునో, ఆయోగశాస్త్ర ప్రసిద్ధమైన యోగినియైనది భూతభవిష్యత్తులను దెలిసికొనును. నిశ్చయముగా ఆకాశమునందు సంచరించును.

శ్లో॥ "దేహసిద్ధింలభన్తేచ వజ్రోల్యభ్యాసయోగతః
అయంపుణ్యకరోయోగోభోగే భుక్తే ఽపిముక్తిదః॥

తా. వజ్రోల్యభ్యాసముచేత సిద్ధించిన యోగముచేత (రూపము, లావణ్యము, బలము, వజ్రమును చూర్ణముగా చేయునట్టి శక్తి అను వీనిని) దేహసిద్ధిని బొందుచున్నారు.

ఈ వజ్రోల్యభ్యాస యోగము అదృష్టవిశేషమైన పుణ్యమును కలుగజేయునదిగను, భోగములను అనుభవించుచుండఁగా ముక్తి నియొసంగునదిగను నున్నది. శక్తిచాలనము నుద్యోగించి ప్రథమమున తత్త్వయుక్తమైన కుండలినియొక్క సమవాచకముల చెప్పెద.

'అథ కుణ్డలినీ నామాని కథ్యంతే

తా. కుండలినీశక్తి పర్యాయపదములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ కుటిలాఙ్గీ కుణ్డలినీ భుజఙ్గీ శక్తిరీశ్వరీ
కుణ్డ ల్యరుంధతీచైతే శబ్దాః పర్యాయవాచకాః''

తా. కుటిలాంగి, కుండలిని, భుజంగి, శక్తి, ఈశ్వరి, కుండలి, అరుంధతి, అనునీ యేఁడుపేరులును (ఒకదానికొకటి) పర్యాయపదములు.

శ్లో॥ "యేన మార్గేణ గన్తవ్యం బ్రహ్మజ్ఞానం నిరామయం
ముఖేనాచ్ఛాద్య తద్ద్వారం ప్రసుప్తా పరమేశ్వరీ॥"

తా. నిరామయబ్రహ్మజ్ఞానమైన (రోగజన్యదుఃఖములేని ఆవిర్భావమును కలుగఁజేయునట్టి స్థానమైన) బ్రహ్మరంధ్రము ఏసుషుమ్నామార్గముచేతఁ బొందబడుచున్నదో, ఆమార్గము యొక్క ద్వారమును ముఖముచేమూసికొని పరమేశ్వరియనెడి కుండలిని నిద్రించుచున్నది. 'తస్యాఃశిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః" దాని శిఖయొక్క మధ్యయందు పరమాత్మ యున్నాఁడు, అను శ్రుతివలన బ్రహ్మరంధ్రము బ్రహ్మస్థానమనఁబడెను. ఇందువలన యోగము లేక జ్ఞానము, మోక్షము సిద్ధింపదని సిద్ధించెను. శ్రుతి, స్మృతీతిహాస పురాణములయందు నిది ప్రసిద్ధము. ఎట్లంటేని ?

శ్రుతి ప్రమాణములు:— "అథ తద్దర్శ నాభ్యుపాయో యోగః" ఇంక దానియొక్క అత్మదర్శనమునకు సాధనము యోగము, అనునిదియును, అధ్యాత్మయో గాధిగమనే దేవం మత్వా ధీరోహర్ష శోకౌజహాతి" అధ్యాత్మ యోగమును బొందుటవలన దైవమును (ఆత్మను) తెలిసి ధీరుఁడు సుఖదుఃఖములను వదలుచున్నాడు. అను నిదియును, "శ్రద్ధాభక్తిధ్యాన యోగాదవేద" శ్రద్ధ, భక్తి, ధ్యానయోగముల చేత తెలిసికొనునది. అను నిదియును "యదాపఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసాసహ బుద్ధిశ్చ నవిచేష్టేత తామాహుః పరమాంగతిం. తాంయోగమితిమన్యన్తే స్థిర మిన్ద్రియధారణామ్ అప్రమత్త స్తదాభవతి." ఎప్పుడు పంచజ్ఞానేంద్రియములును మనస్సుతో (ఆత్మయందు నిలుచుచున్నవో, బుద్ధియును తన వ్యాపారము నందు) చేష్టించుటలేదో, ఆ యవస్థను యోగీశ్వరులు పరమ గతియని చెప్పుదురు. దానిని యోగమని తెలిసికొనియెదరు. ఎప్పుడు స్థిరమైన యింద్రియ ధారణయందు ప్రమాదము లేని వాఁడగుచున్నాఁడో అప్పుడు యోగమునందు ప్రవర్తించిన వాఁడగుచున్నాఁడు. అనునిదియును "యదాత్మతత్త్వే నతు బ్రహ్మతత్త్వం దీపోపమే నేహయుక్తః ప్రపశ్యేత్" ఎప్పుడు ఇచ్చట యోగి ఆత్మతత్త్వముగా బ్రహ్మతత్త్వమును దీప సమానముగా గనుచున్నాఁడో, అనునిదియును, "అజంధ్రువం సర్వతత్త్వై ర్విశుద్ధింజ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః" పుట్టుకలేనిదియును, ఎన్నటికిని యుండునదియును, సకలతత్త్వములకంటె శుద్ధమైనదియును, నగుదైవమును (ఆత్మను) తెలిసికొని సకల పాశములయందుండి విడివడుచున్నాఁడు. అనునిదియును, "బ్రహ్మణేత్వామహాస ఓమిత్యాత్మానంయుఞ్జీత" జ్ఞాన

మైన బ్రహ్మమునందు ఓమ్ అని ఆత్మతత్త్వమైన నిన్ను ధ్యానమును జేయుదువుగాక. అనునదియును, "త్రిరున్నతం స్థాప్యసమంశరీరః హృదీంద్రి యాణి మనసాసన్నివేశ్య బ్రహ్మో డుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని" శిరస్సు, కంఠము, శరీరము, అను మూఁటిని చక్కఁగా నిలిపి సమశరీరుఁడై హృదయమునందు మనస్సుతో ఇంద్రియములను ప్రవేశింపఁజేసి బ్రహ్మమనెడి తెప్పచేత విద్వాంసుఁడు సకల నదులను (ఇంద్రియ మార్గములను) చక్కఁగా దాటుచున్నాఁడు. అనునదియును, 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం' ఓమని యిట్లు ఆత్మను ధ్యానింతువుగాక. అనునదియును, అగు నివిశ్రుతులు.

అథస్మృతిప్రమాణాని కథ్యంతే:– స్మృతిప్రమాణముల జెప్పుచున్నాఁడ. మనువు చెప్పిన యతిధర్మ ప్రకరణమునందు. "భూతభావ్యా నవేక్షేత యోగేన పరమాత్మనః, దేహా ద్వయం విహాయాశు ముక్తోభవతి బన్ధనాత్" పరమాత్మ యొక్క యోగముచేత గతించినవానిని వచ్చువానిని చూచును. రెండుదేహములను విడిచి శీఘ్రముగా బంధను నుండి విముక్తుఁడగును. అనునదియును, యాజ్ఞవల్క్య స్మృతి యందు "ఇజ్యాచార దమాహింసా దానస్వాధ్యాయ కర్మణాం అయంహి పరమోధర్మో యద్యోగే నాత్మదర్శనమ్" యాగము, ఆచారము, దమము, అహింస, దానము, స్వాధ్యాయము, (వేదాదులను చదువుట) మొదలగు కర్మల కంటెను, యోగముచేత ఆత్మను దర్శించుటయే మేలైన ధర్మము. అను నదియును. మహర్షి మాతంగులు" అగ్ని ష్టోమాదికాన్ సర్వాన్ విహాయ ద్విజసత్తమః యోగాభ్యాస

రతః శాన్తః పరం బ్రహ్మాధిగచ్ఛతి. బ్రాహ్మణ క్షత్రియవిశాం స్త్రీశూద్రాణాం చ పావనమ్ శాన్తయే కర్మణామన్య ద్యోగా న్నాస్తి విముక్తయే॥ ద్విజోత్తముఁడు అగ్నిష్టోమము మొదలగు సకలమును విడిచి యోగాభ్యాస పరాయణుఁడై శాంతుఁడై పరబ్రహ్మమును బొందుచున్నాఁడు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, స్త్రీ, శూద్రులకు కర్మములయొక్క శాంతియైనట్టి ముక్తి, నిత్యము పరిశుద్ధమైనది యోగముకంటె వేఱె లేదు, అనునదియును, దక్షస్మృతియందు వ్యతిరేకముగా "స్వసం వేద్యంహితత్ బ్రహ్మ కుమారీ స్త్రీ సుఖంయథా, అయోగీ నైవజానాతి జాత్యన్ధోహి యథాఘటమ్" ఆబ్రహ్మము కొమరు ప్రాయముగల స్త్రీ యొక్క రతిసుఖమువలె తనచేత నే యెఱుఁగఁదగినది జాత్యంధుఁడు (పుట్టుగ్రుడ్డి) కుండను తెలియని యట్లు అయోగియైనవాఁడు తెలిసికొనఁడు." అనునదియును, అగునివి స్మృతులు.

"అథపురాణ ప్రమాణాని ఉచ్యంతే" పురాణములు, భారతేతిహాసములు చెప్పుచున్నాను. శ్రీ మహాభారతము నందు "అపివర్ణావకృష్టస్తు నారీవాధర్మకాజ్క్షిణీ, తావ ప్యేతేన మార్గేణ గచ్ఛేతాం పరమాంగతిమ్, యదివా సర్వ ధర్మజ్ఞో యదివా ప్యకృతీ పుమాన్ యదివా ధార్మికశ్రేష్ఠో యదివాపాపకృత్తమః, యదివాపురుషవ్యాఘ్రో యదివా క్లైబ్యధారకః, నరః సేవ్యఃమహాదుఃఖం జరామరణసాగరమ్, అపిజిజ్ఞాసమానోపి శబ్ద బ్రహ్మాతివర్తతే" తన వర్ణమునుండి వదలినవాఁడైనను, లేక ధర్మమును గోరునట్టి స్త్రీయైనను, ఆయిర్వురును ఈ యోగ మార్గముచేత పరమగతిని పొందుదురు. అదిలేని పురుషుఁడు సకల ధర్మముల నెఱింగినవాఁడై

నను, లేక దుశ్చేష్టలుగలవాఁడైనను, శ్రేష్ఠధర్మముకలవాఁడై నను మిగుల పాపియైనను, పురుషశ్రేష్ఠుఁడైనను, లేక నపుంసకుఁడుగా నుండినను వాఁడు మహాదుఃఖకరమైన జరామరణ సాగరమును సేవించు (అనుభవించు) వాఁడగుచున్నాఁడు. యోగమును దెలియఁగోరువాఁడును, శబ్దబ్రహ్మమును (వేదమునందు చెప్పఁబడిన కర్మములను, దాటుచున్నాఁడు. అనునిదియును, భగవద్గీతయందు భగవాన్ శ్రీకృష్ణవాక్యము అనఁగా మద్వాక్యము నారదా! వినుము. "యుఞ్జన్నేవంసదాత్మానం యోగీనియతమానసః శాన్తిం నిర్వాణ పరమాం మత్సంస్థామధిగచ్ఛతి యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం" అణఁగిన మనస్సుగలయోగి ఇట్లెప్పుడును తనమనస్సును సమాధానము (స్వాధీనము) గలదానినిగాఁజేసి (సంసారనివృత్తియైన) శాంతి యనెడి మేలైన నిర్వాణమైన నాయొక్క స్థానమునుబొందుచున్నాఁడు. ఏస్థానము (కైవల్యము) సాంఖ్యుల (జ్ఞాననిష్ఠగల సన్న్యాసుల) వలన పొందఁబడుచున్నదో, అది యోగుల చేతను పొందఁబడుచున్నది అనునిదియును, ఆదిత్య (సౌర) పురాణమునందు "యోగాత్సంజాయతే జ్ఞానం యోగోమయ్యేకచిత్తతా" యోగముచేత జ్ఞానము కలుగుచున్నది. యోగమనునది నాయందు ఒకే మనస్సుగా నుండుట. అనునిదియును స్కాందపురాణమునందు "ఆత్మజ్ఞానేన ముక్తిఃస్యాత్తచ్చ యోగాదృతేనహి సచయోగశ్చిరంకాల మభ్యాసాదేవ సిద్ధ్యతి" జ్ఞానముచేత ముక్తికలుగుచున్నది. అదియును (అజ్ఞానమును) యోగము లేక కలుగుటలేదు. ఆయోగమును బహుకాలాభ్యాసముచేతనే సిద్ధించుచున్నది, అనునిదియును కూర్మపురాణమునందు,

శ్లో॥ "అతఃపరం ప్రవక్ష్యామి యోగంపరమదుర్లభమ్
యేనాత్మానం ప్రపశ్యన్తి భానుమన్తమివేశ్వరం
యోగాగ్నిర్దహతిక్షిప్రమశేషం పాపపఞ్జరమ్
ప్రసన్నం జాయతేజ్ఞానం జ్ఞానాన్నిర్వాణమృచ్ఛతి"

దీనికిమీఁద దేనిచేత సూర్యునివలె ఆత్మస్వరూపియైన ఈశ్వరుని చూచుచున్నారో, అట్టి మిగుల దుర్లభమైన యోగమును చెప్పుచున్నాఁడను. యోగాగ్నియనునది సకల పాప సంఘములను శీఘ్రముగ దహించుచున్నది. అందువలన ప్రసన్నమైన జ్ఞానము గలుగుచున్నది. జ్ఞానమువలన నిర్వాణమును (మోక్షమును) పొందుచున్నాఁడు. అనునదియును,

శ్లో॥ "తథాయతేత మతిమాన్యథాసాన్నిర్వృతిః పరా,
యోగేనలభ్యతే సాతు నచాన్యేనతుకేనచిత్
భవతాపేన తప్తానాం యోగోహి పరమౌషధమ్
పరావరప్రసక్తాధీర్యస్యనిర్వేద సంభవా
సచయోగాగ్నినాదగ్ధ సమస్తక్లేశ సంచయః
నిర్వాణం పరమంనిత్యం ప్రాప్నోత్యేవ నసంశయః
సంప్రాప్త యోగసిద్ధిస్తు పూర్ణోయస్త్వాత్మదర్శనాత్
నకిఞ్చిద్దృశ్యతే కార్యం తేనైవ సకలం కృతమ్
ఆత్మారామః సదాపూర్ణః సుఖమాత్యన్తికంగతః
అతస్తస్యాఽపినిర్వేదః పరమానంద కస్యచ
తపసాభావితాత్మానో యోగినః సంయతేన్ద్రియః
ప్రతరన్తి మహాత్మానో యోగేనైవ మహార్ణవమ్."

బుద్ధిమంతుఁడు శ్రేష్ఠమైన నిర్వృతి (సుఖము) కలుగు నిమిత్తము ప్రయత్నముచేయవలయును. ఆసుఖము యోగము చేతనే పొందఁబడుచున్నది. వేఱె దేనిచేతను పొందఁబడుట లేదు. భవ (సంసార) తాపముచేత దపించువారికి యోగమే శ్రేష్ఠమైన యౌషధమగును. లోక విషయములయందు నసహ్యమును కలదియును, పరావరము (పరబ్రహ్మము) నందు

ప్రియముగలదియునైన బుద్ధిగలవాఁడు యోగాగ్నిచే దహింపబడిన సకలక్లేశసంఘములు గలవాఁడై నిత్యమును శ్రేష్ఠ (అనిర్వాచ్య) మైనముక్తిని పొందుచున్నాఁడు. నిజము యోగసిద్ధిని సంపూర్ణముగా బొందినవానికి ఆత్మదర్శనముతప్ప, చేయదగు కార్యము వేరొకటి లేనేలేదు. అందుచేత ఆత్మారాముడును సదాపూర్ణుఁడును అత్యంతసుఖము బొందువాడునగును. ఆమీాద పరమానందనుయుడైనట్టి వానికి నిర్వేదము (ప్రియములేనిది) కలుగుచున్నది. పరమానందస్వరూపమే యగుటంజేసి దేనియందును కోరిక కలుగదు. సదా తపస్సుచేత భావింపఁబడిన మనస్సుగల యోగులయిన జితేంద్రియులు నగు మహాత్ములు యోగముచేతనే (సంసారమనెడి) దుస్తర మహాసముద్రమునుతరించుచున్నారు." అనునిదియును విష్ణుధర్మమునందు

శ్లో॥ యచ్ఛ్రేయః సర్వభూతానాం స్త్రీణామప్యుపకారకమ్
అపికీటపతఙ్గానాం తన్నశ్రేయః పరంపదం
ఇత్యుక్తః కపిలః పూర్వం దేవైర్దేవర్షిభిస్తథా
యోగఏవపరం శ్రేయ స్తేషా మిత్యుక్తవాన్ పురా॥"

ఏ శ్రేయస్సు (పుణ్యము) సకలభూతములకును, మిడుతలకును, తదితర కీటకములకును (పురుగులకును) మహోపకారము గలదిగానున్నదో, ఆ మేలయిన శ్రేయస్సును మాకు జెప్పుఁడని మును దేవతలచేతను మహర్షులచేతను ప్రశ్నింపబడిన కపిలమహర్షి వారితో యోగమే మేలైన శ్రేయస్సని చెప్పియున్నాఁడు. ఆ కపిలుడను నేనే, అని తెలిసికొనుము. వసిష్ఠులు —

శ్లో॥ "దుస్సహారామ సంసార విషవేగ విషూచికా
యోగగారుడ మన్త్రేణ పావనేనోపశామ్యతి॥"

రామా ! సంసారమనెడి విషవేగముగల విషూచివ్యాధి పరిశుద్ధమైన యోగమనెడి గారుడమంత్రముచేతనశించుచున్నది. అనునివి యన్నియును పురాణవచనములు.

కం. పంచావస్థలఁ దగిలియు
బంచావస్థలను గడచు ప్రాజ్ఞుఁడు త్రిజగ
ద్వంచకుఁడై లోకులవలె
సంచారముచేయుచుండు సంపఁగిమన్నా !

మఱియు,

ఆ. ఆదినొకటిదెలిసియది మనంబుననిల్పి
ఆదిబాయకున్న నభవుఁడౌను,
ఆదిబాసినట్టి యాతఁడేభఁవుఁడయా
విశ్వదాభిరామ వినురవేమ !

తా. తనకు ముందున్నది అచల పరిపూర్ణ పరబ్రహ్మ పరమతత్త్వాతీతము; దానిని సదా జ్ఞప్తియం దుంచుకొనవలెను. దానిని మఱవకయుండినయెడల సమర్థుఁడగును. మఱచినవాడు మృతప్రాయుఁడు. జ్ఞాపకముంచుకొనినవాఁడుమృత్యుంజయుఁడు మృత్యువనగా నేమంటేని –

శ్లో॥ "మృత్యోస్సమృత్యు మాప్నోతి య ఇహనానేవ పశ్యతి
యదా హ్యేవైష ఏతస్మి న్నుదరమంతరంకురు తే
అథతస్యభయంభవతి॥"

ఇత్యాది శ్రుతివాక్యరీతిగా నట్టియఖండ పరిపూర్ణాచల పరబ్రహ్మమునందు నెవ్వఁడు భేదబుద్ధి గలవాఁడో వాఁడు మృత్యురూపమైన జననమరణ దుఃఖ సంసార సాగరంబున

మునిఁగి దుఃఖించుచుండును. ఎన్నటికిని విముక్తి జెందఁడు ధ్రువము, "ఏక ఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః

ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥"

అను శ్రుతి వచనప్రకారము సర్వభూతములయందు వ్యాపించియుండు పరబ్రహ్మస్వరూపమైన యాత్మ ఒక్కఁడే అయినను చంద్రుఁడొక్కఁడే నీళ్ళకుండయందు ప్రతిఫలించి అనేకజీవులుగా తోఁచుచున్నాఁడు. మఱియు గంగానది జలములందు ప్రతిబింబించిన సూర్యుఁడున్నూ చండాలునియింటినీళ్ళ కుండలో ప్రతిబింబించిన సూర్యుఁడున్నూ ఒకఁడే, ఆరెంటికిని భేదము లేనట్లు నీ యంతఃకరణమునందు ప్రతిబింబితుఁడగు జీవునకును సర్వ భూతాంతర్గతుడగు జీవునకును కొంచెమైనను భేదములేదు. మఱియు,

ఆ. అచలతత్త్వమనఁగ ననుభవగమ్యంబు
చూచి చెప్పరాదు సూక్ష్మమిదియె
మదికిఁదోఁచుగాని మర్మమెన్నఁగరాదు
విశ్వదాభిరామ వినుర వేమ!

తే. ఆత్మ తనలోన గమకించి యనుదినంబు
నిర్గుణాత్మార్చనముఁజేసి నిత్యమమరఁ
బ్రత్యగాత్మనులోనెంచి ప్రబలుయోగి
సచ్చిదానందపదమున సతతముండు

తా. సోహం అనెడి ధ్యానమును యోగియగువాఁడు మొదట అభ్యసించును. ఆత్మసాక్షాత్కారమగునది యీదారి వలన క్రమముగా (యుజ్యత ఇతియోగః) ఐక్యము సచ్చిదానంద పరబ్రహ్మమునందు నిష్ణాతుఁడగును.

శ్రుతి:-"సృష్టేః పురా నామరూప వివర్జితం."
శ్రుతి:-"సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్."
"ఏకమేవాద్వితీయం నేహనానాస్తికించన"

బ్రహ్మణోరవ్యక్తః, అవ్యక్తాన్మహాతః మహతోఽహంకారః అహంకారాత్పంచతన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచభూతాని పంచభూతేభ్యః పంచమహాభూతాని పంచమహాభూతేభ్యో ఇదం జగత్.

సీ. ఆత్మయందున నేక మాకాశముదయించె
నాకాశమునఁబుట్టె నాయనిలము
అనిలంబువల్లను నగ్నిహోత్రుఁడు పుట్టె
నగ్నిహోత్రునివలన నప్పుపుట్టె
నప్పువలన మహాదవనీస్థలముపుట్టె
నవనియందోషధు లమరఁబుట్టె
నోషధులందున నొనర నన్నముపుట్టె
నన్నమందుననరు లాదిసకల
జంతుజాలంబులాయె నీ జగతియుగము
లాయెనీరీతి పరమాత్మ మాయవలన.

శ్లో॥ మయ్యేవసకలం జాతంమయి సర్వం ప్రతిష్ఠితమ్
మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మద్వయమస్మ్యహమ్.

(కైవల్యోపనిషత్తు) అనగా – ఆ అవ్యక్తమునందే సర్వము పుట్టును, పెరుగును. మరల దానియందేలయించును. మఱియు అథచైనం నిత్యజాతం నిత్యంవామన్యసేమృతం ॥ మఱియు, అవ్యక్తాదీనిభూతాని వ్యక్త మధ్యానిభారత, అవ్యక్త

నిధనా న్యేవ తత్రకా పరివేదనా॥ (శ్రీమద్భగవద్గీత- ఓ అర్జునా! వృథాగా నెందుకు దుఃఖించెదవు? ఏలనంటేని?

ఆ. జననమరణములకు సరిస్వతంత్రుఁడుగాడు
జగములెల్లనిండ జలములంద్రు
అవనిలోనజనులు నరయంగ లేరయా
విశ్వదాభిరామ వినుర వేమ.

అర్జునా! వీరెవ్వరు నీ బంధువులుగారు. నిమిత్తమాత్ర మిట్లు పిలువబడుచున్నారు. సర్వము ఆత్మ స్వరూపమే. అనేమాయ వేషములతో అవతరించుచున్నది. నీ వెందుకు దుఃఖించెదవు. సంచితాగామి ప్రారబ్ధంబులు ననుభవింపకతప్పదు. వివేక చూడామణియందు శ్లో॥ ప్రారబ్ధం బలవత్తరంఖలు నృణాంభోగేనతస్యక్షయః సమ్యక్ జ్ఞాన హుతాశనేన విలయం ప్రాక్సంచితాగామినా బ్రహ్మాత్మైక్య మవేక్ష్యతన్మయతయా యే సర్వదా సంస్థితాస్తేషాం తత్త్రితయం నహిక్వచిదపి బ్రహ్మైవతే నిర్గుణం. ఆగామి, సంచిత, ప్రారబ్ధంబులని కర్మలు మూఁడు విధములుగా నున్నవి. ఈ మూఁటిలో ప్రారబ్ధము కడుబలీయంబు అందువలన బ్రహ్మజ్ఞానులు సైతము దానిని ననుభవించక తీఱదు. జ్ఞానాగ్నిచే సంచితాగామి ప్రారబ్ధకర్మలు నశించుచుండును. జీవబ్రహ్మైక్యముగని జ్ఞానమూర్తులై యుండువారికి నీ మూఁడు కర్మలు లేవు. వారు కేవల నిర్గుణ పరబ్రహ్మ స్వరూపములతో నుందురు.

శ్లో॥ ఉపాధితాదాత్మ్య విహీనకేవలం
బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో మునేః
ప్రారబ్ధసద్భావకథానయుక్తా
స్వప్నార్థ సంబంధ కథేవ జాగ్రతః॥

తా. సత్యముకాని దేహేంద్రియాదులనెడి యుపాధుల సంబంధములేని యద్వయ బ్రహ్మముగానే యుండు సమాధి నిష్ఠుఁడగు పరమయోగికి మేలుకొనిన వాని కంతకుముందు స్వప్నదశయందలి విషయముల తలంపులేనట్లు ప్రారబ్ధకర్మాను భవములేదు.

శ్లో॥ నహిప్రబుద్ధః ప్రతిభాసదేహేనభాతియోగిన్యపిచప్రపంచే
కరోత్యహంతాం మమతామి మాంచకింతుస్వయంతిష్ఠతి జాగరేణ॥

శ్రీ భగవచ్ఛంకరాచార్యుల చూడామణియందు జ్ఞాన యోగి మిథ్యయయ్యు సత్యమువలె కనపడు నీ శరీరమందును, తాను, తనది, వీనిది, యను బుద్ధినుంపక తనకుతాను జాగ్రద్దశలో నుండును. కలలోగాంచిన వస్తువునందు జ్ఞప్తిలేనట్లు బ్రహ్మవేత్తకు ఆహార విసర్జనాదికర్మలయందు దలంపుండదు.

మఱియు,

శ్లో॥ కర్మణా నిర్మితోదేహః ప్రారబ్ధంతస్యకల్ప్యతాం
నానాదేరాత్మనోయుక్తంనైవాత్మా కర్మనిర్మితః॥

శ్రుతి:-అజోనిత్యశ్శాశ్వత ఇతిబ్రూతే. శ్రుతి రమోఘవాక్
తదాత్మ నాతిష్ఠ తోఽస్యకుతః ప్రారబ్ధకల్పనా

పరమాత్మ పుట్టువు లేనివాఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు, అట్టివానికి ప్రారబ్ధముండదు. కావున అన్నిటికిమిన్నయగునది యోగమే, అట్టియోగము. అపరోక్ష జ్ఞానమునకు సాధనమై యుండుటవలన యోగబీజమునందు శ్రీదేవ్యువాచ.

శ్లో॥ జ్ఞానినస్తు మృతాయేవై తేషాం భవతి కీదృశీ
గతిఃకథయ దేవేశ కారుణ్యామృత వారిధే॥

పార్వతి యడుగుచున్నది. ఓ కరుణా సాగరా! దేవదేవ ! గతించిన జ్ఞానులస్థితి యెట్లుండును ?

ఈశ్వరఉవాచ :-

శ్లో॥ దేహాంతేజ్ఞానినా పుణ్యాత్ పాపాత్ ఫలమవాప్యతే
యాదృశంతు భవేత్తత్త ద్భుక్త్వాజ్ఞానీ పునర్భవేత్
పశ్చాత్పుణ్యేన లభతే సిద్ధేన సహసంగతిం
తతస్సిద్ధస్యకృపయా యోగీ భవతి నాన్యథా
తతోనశ్యతి సంసారో నాన్యథా శివభాషితమ్॥

ఈశ్వరుడు చెప్పుచున్నాడు. దేహావసానమందు, జ్ఞాన (దృఢాఽపరోక్షజ్ఞానము లేనివాఁడు) పుణ్యపాపములయొక్క ఫలమును బొందుచున్నాఁడు. ఎట్టిఫలము కలుగుచున్నదో అది యనుభవించి జ్ఞాని మరల పుట్టుచున్నాఁడు. తర్వాత వానికి సిద్ధులతో సంగము కలుగుచున్నది. తర్వాత నా సిద్ధుల (మోక్షసిద్ధిగలవారి)యొక్క కృపచేత యోగియగుచున్నాడు. వేఱువిధముచేనగుటలేదు. కాఁబట్టి సంసారమునశించుచున్నది.

దేవ్యువాచ :-

శ్లో॥ జ్ఞానాదేవహి మోక్షంచ వదన్తి జ్ఞానినస్సదా
సకథం సిద్ధ్యతితతో యోగస్యామోక్షదోభవేత్॥"

దేవి అడుగుచున్నది. జ్ఞానముచేతనే మోక్షము గలుగు చున్నది. మఱియొక విధముచే కలుగదని జ్ఞానులు చెప్పు చున్నారు. కావున యోగమేల మోక్షము నిచ్చును?

ఈశ్వరఉవాచ :-

శ్లో॥ జ్ఞానేనైవతు మోక్షోహి తేషాం వాక్యంతు నాన్యథా
సర్వేవదన్తి ఖడ్గేన జయో భవతి తర్హి కిమ్
వినాయుద్ధేన వీర్యేణ కథం జయ మవాప్నుయాత్
తథాయోగేనరహితం జ్ఞానం మోక్షాయ నోభవేత్॥

ఈశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. దేవీ! జ్ఞానము చేతనే మోక్షము కలుగుననువారి మాట సత్యము. ఎల్లరు కత్తిచే జయము గలుగుచున్నది యని చెప్పుచున్నారు. అయినను యుద్ధమును బలమును లేక జయము నెట్లు పొందగలరు? అట్లే యోగములేని జ్ఞానము మోక్షమీయఁజాలదు. అట్లయినచో జనకాదులకు యోగము లేకయే ప్రతిబంధములేని జ్ఞానము, మోక్షము కలుగుటకు హేతువు చెప్పెద వినుము. వారు పూర్వజన్మమందు చేసినయట్టి సంస్కారసంపదచే నట్లుకలుగుటకు కారణమని పురాణవాక్యములు,

శ్లో॥ జైగీషవ్యోయదా విప్రో యథాచైవాzసితాదయః
క్షత్రియా జనకాద్యాస్తు తులాధారాదయోవిశః
సంప్రాప్తాః పరమాంసిద్ధిం పూర్వాభ్యాసస్తు యోగతః
ధర్మవ్యాధాదయ స్సప్త శూద్రాః పైలవకాదయః
మైత్రేయీ, సులభా, శార్ఙ్గీ శాండిలీచ తపస్వినీ
ఏతే చాన్యేచ బహవో నీచయోనిగతాఅపి
జ్ఞాన నిష్ఠాంపరాం। సాసా పూర్వాభ్యాసస్తు యోగతః”

జైగీషవ్యుఁడను బ్రాహ్మణుఁడును, అసితుఁడు, మొదలగువారును, జనకాది క్షత్త్రియులును, తులాధారాది వైశ్యులును, ధర్మవ్యాధాది శూద్రులు లేడ్వురును, పైలవాదులును, మైత్రేయి, సులభ, శార్ఙ్గి, శాండిలి, తపస్విని, యను స్త్రీలును మొదలగు ననేకులు పూర్వాభ్యాస యోగబలముచేతనే పర

బ్రహ్మపదనిష్ఠను బొందిరి. మఱియుఁ బూర్వజన్మముల యందు ననుష్ఠింపబడిన పుణ్య తారతమ్యములచే గొందఱు బ్రహ్మపుత్రత్వమును, గొందఱు దేవర్షిత్వమును, గొందఱు బ్రహ్మర్షిత్వమును, గొందఱు మునిస్థితిని, కొందఱు భక్త ధర్మమును పొందినారు. వీరిలో గొందఱు గురూపదేశము లేకయే ఆత్మ సాక్షాత్కారము నందిరి. అట్లే హిరణ్యగర్భ వసిష్ఠ, నారద, సనత్కుమార, వామదేవ, శుకమహర్షి మొదలగువారు జన్మచేతనే మోక్షము బొందినారు. ఎల్లరు మోక్షమునకు అర్హులని గరుడ పురాణమునందు.

శ్లో॥ యోగాభ్యాసోన్నృణాం యేషాం నాస్తిజన్మాంతరాదృతః
యోగస్య ప్రాప్త యేతేషాం శూద్రవైశ్యాదిక క్రమః
స్త్రీత్వాచ్ఛూద్రత్వమభ్యేతి తతో వైశ్యత్వ మాప్నుయాత్
తతశ్చక్షత్రియోవిప్రః కృపాహీనస్తతోభవేత్,
అనూచానఃస్మృతో యజ్వా కర్మన్యాసీ తతఃపరమ్,
తతోజ్ఞానిత్వమభ్యేతి యోగీముక్తిం క్రమాల్లభేత్॥

తా. జన్మాంతరమునందు ధ్యానయోగాభ్యాసము లేని వారు యోగాదికముపొందు నిమిత్తము శూద్రులు, వైశ్యులు నయి పుట్టుచున్నారు. ఆదిని స్త్రీఅయి, పిమ్మట నా స్త్రీ ధర్మము నుండి శూద్రుడై తదుపరి యా శూద్రత్వమునుండి వైశ్యుడై పిదప వైశ్యత్వమునుండి క్షత్రియుడై యనంతరము నా క్షాత్రత్వమునుండి విప్రత్వ సిద్ధినొంది తరువాత నావిప్రత్వము నుండి కృపాహీనుడగుచున్నాడు. తరువాత విద్వత్తుగల విప్రు డగుచున్నాడు. స్మృతుఁడు (మనుస్మృతి మొదలగు స్మృతుల ననుసరించినవాఁడు) యజ్ఞయాగాదులు చేయువాడగును. తరు వాత కర్మసన్న్యాసి అగుచున్నాఁడు. తర్వాత జ్ఞానసిద్ధినందును

తర్వాత ముక్తి (మోక్షము) పొందును. యోగి యీ ప్రకార ముగా క్రమక్రమముగా స్త్రీ శూద్ర వైశ్యాది జన్మపరంపరగా యోగత్వసిద్ధినంది తరించుచున్నాఁడు. కాఁబట్టి ప్రతివారికి యోగత్వసిద్ధి నందుట కధికారము కలదు.

భగవద్గీత :-

శ్లో॥ శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోహిజాయతే
అథవా యోగినా మేవ॥

యోగభ్రష్టుఁడు శ్రీమంతుల గృహముల యందైనను, యోగీశ్వరుల గృహములందు నైనను జన్మించుచున్నాఁడు. కాఁబట్టి అన్నివర్ణములవారు యోగాభ్యాసాధికమున కర్హులు.

మఱియు భగవద్గీత-

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరంమనః
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధే పరతస్తుసః॥

తా. ఈ స్థూలదేహముకంటె నింద్రియంబులు శ్రేష్ఠము. ఇంద్రియములకన్న మనస్సు గొప్పది. మనస్సుకన్న బుద్ధియు దానికన్న దానికి సాక్షియైన ఆత్మయు గొప్పదని చెప్పబడును. ఆత్మకన్న పరమాత్మ గొప్పది. శ్రుతివాక్యము.

"ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యఃకదాచనః
ప్రమాదోమృత్యు రిత్యాహుర్విద్యాయాం బ్రహ్మవాదినః

అధ్యాత్మోపనిషత్తు అనగా బ్రహ్మనిష్ఠునకు మృత్యువు లేదు. వదలినవారికి జననమరణములు తప్పవు. కాబట్టి ఎల్ల ప్పుడు బ్రహ్మనిష్ఠగలవాడు బ్రహ్మవేత్త అనబడును.

శ్లో॥ నాహందేహో నేంద్రియాణ్యంతరంగం
నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః
దారాపత్యక్షేత్ర విత్తాది దూర
స్సాక్షీ నిత్యం ప్రత్యగాత్మా శివోహమ్॥

వేమన-ఆ, తనయులు పరివారతయు తంత్రము లెఱింగి పఱఁగకానివాని బాబ్రద్రోలి హితవరులనుజేర్చి యిల్లు నిల్పిన వాఁడు, ముక్తికాంతకతడు మొగుడు వేమ॥
ఆచార్యస్వామి వాక్యము.

శ్లో॥ సాకారంచ నిరాకారం నిర్గుణంచగుణాత్మకం
తత్త్వం తత్పరమం బ్రహ్మ ఇతివేదాంత డిండిమః

చైతన్యము మాయా సహితంబై సచ్చిదానందమగు చున్నది. సహిత రహితమగు చైతన్యము పలురకములగు చున్నది. బ్రహ్మపదార్థ మెప్పుడు నట్లుకాదు. చైతన్యములేని సుషుప్తిలో నానందముండును. సుషుప్తి యనఁగా దేహ మేమియు లేదని యర్థము, ఇయ్యది గురుకృపగలవారికి లభ్యము.

శ్రుతి, జ్ఞానమానందగురు బ్రహ్మ ఇత్యుక్తం మూఢమానవైః
భ్రాంతి మూలమిదం జ్ఞానం జ్ఞాన భ్రాంతిస్తు నిశ్చితం
జ్ఞానాత్సంజాయతేఽనందః ఆనంద భ్రాంతి లక్షణమ్
సత్యం జ్ఞాన మనంతంచ మాయాగుణ మితిశృణు॥

తా. మూఢులు మాయావిష్టమగు బ్రహ్మమును తెలియనేరక పలుపోకలు పోవుచు పలువిధంబులు చెప్పుదురు మేడమెట్లు ఒకటి తర్వాత నొకటి ఎట్లు ఎక్కుదుమో, అట్లే సగుణారాధన చేయుచు నది నిత్యమని యెంచక నిర్గుణ

బ్రహ్మము దెలియవలెను. అప్పుడే వాఁడు ధన్యుఁడు. వైరా గ్యాది సాధన సంపత్తి సంపాదించుటకు లక్షణము.

శ్లో॥ నోత్పద్యతే వినాసిద్ధిం విచారేణాన్య సాధనైః
యథాపదార్థభావంహి ప్రకాశేన వినాక్వచిత్॥

అపరోక్షానుభూతి వాక్య భావార్థ మేమనగా
తా నిదివఱకు తెలిసిన సాధన సంపత్తితో గూడిన యాత్మ సుఖంబు నపేక్షించి వాడు జ్ఞానసిద్ధి నంద విచార మొనర్ప వలయును. అట్లు చేసిన శ్రేష్ఠఫలము గలుగునని చెప్పబడు చున్నది.

శ్లో॥ కోహంకథ మిదం జాతం కోవాకర్తాఽస్య విద్యతే
ఉపాదానంకిమ స్తీహ విచారస్సోయ మీదృశః॥

తా. నేనెవ్వఁడను? సమస్త ప్రపంచమే దానివలన గలిగెను? అద్దానికి కారణకర్త యెవ్వఁడు? ఇందు నుపా దానకారణ మేది? అనుటయే విచార పదార్థము.

శంకరభగవానుని యపరోక్షానుభూతివాక్యము

శ్లో॥ నాహంభూతగణోదేహో నాహంచాక్షగణ స్తథా
ఏతద్విలక్షణఃకశ్చిత్ విచారఃసోయమీదృశః॥

తా. పంచభూతాత్మకమైన దేహము నేనుకాదు. దశేంద్రియంబులు నేనుకాదు. వీనికి వేఱును, అనిర్వాచ్యుడ నునై యిట్లున్నాను. అనునదియే విచారమని చెప్పుదురు.

శ్లో॥ అజ్ఞానప్రభవంసర్వం ప్రపంచః ప్రవిలీయతే
సంకల్పో వివిధఃకర్తా విచారస్సోయమీదృశః॥

తా. అజ్ఞానమువలన సకల (నామరూప స్వరూపవిశిష్టమైన) ప్రపంచము జ్ఞానమార్గానుసంధానముచేనశించుచున్నది. అనేకవిధములైన సంకల్పములకు కర్త యెవడని యూహించుటయే విచారము.

శ్లో॥ ఏతయో ర్యదుపాదాన మేకంసూక్ష్మం సదవ్యయమ్
యథైవమృద్ఘటాదీనాం విచారస్సోయమీదృశః ॥

తా. అది ఘటము (కుండ) అది పటము (వస్త్రము) మొదలగువానికి మన్ను, తంతువులు (దారములు) యుపాదాన హేతువులైనట్లు, అజ్ఞాని సంకల్పములకు, ఏకము (ఒకటే) సూక్ష్మము (కంటికి గనబడనిది) అవ్యయము (నాశములేనిది) సత్తు (కాలత్రయంబు నందును నుండునది) బ్రహ్మపదార్థము ఉపాదానము (సృష్టిస్థితిలయములకు) హేతువు. అని తెలియుటే విచార మనఁబడును. కాఁబట్టి కార్యకారణ వ్యత్యాసము వాగ్వ్యాపారమనియు, జీవబ్రహ్మలకు అభేదము మాత్రము సత్యమనియు తెలియఁదగినది. ఏలనంటేని.

శ్లో॥ అహమేకోఽపి సూక్ష్మంచ జ్ఞాతా సాక్షీ సదావ్యయః
తదహం నాత్రసందేహో విచారస్సోయ మీదృశః.

తా. నేనేకమును, సూక్ష్మమును, జ్ఞాతయు (తెలిసినవాడను) సాక్షియు, సత్తయు నవ్యయము, నైనవాఁడను కావున నద్దియే నేను దీనికి సందేహము లేదు. అనుభావమే విచారమగును "అజ్ఞానులు జీవబ్రహ్మైక్యానుసంధానమంగీకరింపరు" ఎట్లన?

శ్లో॥ ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిరావృతః
తయోరైక్యం ప్రపశ్యంతి కిమజ్ఞాన మతఃపరం॥

తా. ఆత్మ నిష్కలము, ఏకము శ్రోత్రము (చెవి) మొదలైన వివిధములగు కలలచేత నావృతమైనది. ఆరెంటికి నైక్యభావము (తార్కికులు మొదలగువారు) తెలిసికొను చున్నారు. ఇంతకంటె (జీవబ్రహ్మలకు నైక్యానుసంధాన మంగీకరించుటకంటె) అజ్ఞానము వేఱేలేదు'' శ్రుతి – ఏకఏవాత్మ మంతవ్యో జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్థానత్రయ వ్యతీతస్య పునర్జన్మ నవిద్యతే''

తా. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలులేనిది యాత్మ, అట్టి ఆత్మ సాక్షాత్కారముగలవారికి పునర్జన్మలేదు. ఏజన్మమున బంధత్రయము, లేక అనగా సంచిత ప్రారబ్ధ ఆగామి పోవునో అప్పుడే ముక్తుడగును. ఇట్టి ముముక్షువులు పవిత్ర చిత్తతకలవారై భూమ్యాది వక్ష్యమాణ జంతుజాల గుణంబులువీక్షించి తత్ప్రకారము నడచుకొనినచో ప్రత్యగాత్మ బ్రహ్మైక్య సాక్షాత్కారజ్ఞానముచే లభించిన మహానందమును నిరంతర మనుభవించు బ్రహ్మవేత్తలగుదురు.

1 భూమి:- జంగమస్థావరములకు మూలాధారమై వాని వాని కార్యములను సహించి యూరకొను విధంబున జ్ఞాని (ముముక్షువు) యెప్పుడును క్షమ, (ఓర్పు) కలిగియుండవలెను. అది లేకున్న తక్కినవి కోటిగుణములున్నను ప్రయోజనము లేదను నిశ్చయజ్ఞానము కలిగియుండవలయును.

2 పర్వతము:- సమస్త ప్రాణికోటికి (పశుపక్షి మనుష్యాదులకు) నుపకరించు తృణ, జల, వృక్ష, లతా, గుల్మాదులు మొదలగునవి యెల్లను తనయందు నుంచుకొనినట్లు స్వార్థపరత్వముమాని పరోపకారబుద్ధి కలిగియుండవలెను.

3 వృక్షము:- మొదలంట నఱికివేసినను, కొమ్మలు కొట్టివేసినను చెక్కలు ముక్కలుగా చేసినను నితరుల కుప యోగపడులాగున తను కాపదవచ్చినను సహించి నిశ్చలచిత్త ముతోనుండి వెనుకంజవేయకుండ తనను నఱకుటకు వచ్చిన వారికిగూడ నిలువనీడయిడినట్లు తన కపకారమొనరించినవారికి గూడ నుపకార మొనర్పవలయును.

4 జలము:- పరిశుద్ధత, మాధుర్యము, లాదిగుణములతో గూడి స్నానపానాదుల కుపకరించులాగున జ్ఞాని యెల్లప్పుడు మంచి నడవడితోడ కూడినవాడై పరిశుద్ధభావముతో నుండ వలయును.

5. అగ్ని:- ఎల్లప్పుడు ప్రకాశించుచు నంధకారము జెందకయుండు విధమున జ్ఞాని యెప్పుడును అజ్ఞాన మొందక విజ్ఞానవిశిష్టుడై యుండవలయును. మఱియు, సమిధలు, కాష్ఠ ములు మొదలగువాని సంయోగసంబంధములచే ప్రకాశించు నట్లు ముముక్షువు నిర్మలతపస్సుచేత ప్రకాశింపవలెను. మఱియు తర్జనభర్జనాది క్రియలచేత నగ్ని తిరోభావమునందినట్లు ముము క్షువు (జ్ఞాని) యితరులవలనగలుగు సంక్షోభము నందగూడదు. అగ్ని తనకు నప్రయత్నముగ లభించినపదార్థములను నిశ్శేష ముగ భక్షించులాగున ఏకాలమున కేదిలభించునో దాని నప్ప టికే యుపయోగించుకొనవలెను. దాచగూడదు. అయత్న సిద్ధముగ తనకు దొరకిన పదార్థజాలమును రుచి గుణాదులెంచ కుండ దినునట్లు ముముక్షువు తనకు లభించుపదార్థము (రుచి) పక్వముల ప్రసక్తికిబోగూడదు. అరణిమథించి యగ్నిని ప్రజ్వ లింపజేయునట్లు ముముక్షువు నిధిధ్యాసమననములచేత జ్ఞాన

ముసు ప్రకాశింపజేసి పరమాత్మనుదర్శింపవలెను. అగ్ని తన్నుపాసించువారల పాపములనొలగించి తనయందు హోమమొనర్చిన ఆజ్యాదిహవిస్సులనెల్ల స్వీకరించునట్లు ముముక్షువు (యోగి) తనను జేరువారి దురితములదొలగించుచు వారొసగెడి పదార్థముల భుజింపవలయును. స్వతస్సిద్ధమైన జ్ఞానమునకు నడ్డుగనున్న ప్రకృతిచేత సృజింపబడిన సదసల్లక్షణములుగల దేవ, తిర్యఙ్మనుష్యాది దేహములందు జీవుడు ప్రవేశించి చంద్రకొఅవి, చింత, కానుగు, తుమ్మ, ముష్టి మొదలగు కాష్ఠములందు జ్వాలాభేదముచేత నగ్ని ప్రకాశించునట్లు వివిధరూపముల ప్రకాశించుచున్నాడని తెలియవలెను. మఱియు నుత్పత్తిలయములు, అగ్నిజ్వాలలకేగాని యగ్నికిలేనట్లు కాలానుగుణ్యముగ భూతకోటికి (ప్రాణి సముదాయమునకు) ఉదయలయములు నియతమైయున్నను జీవునకుమాత్రము యెప్పుడును లేవని తెలిసికొనవలయును.

6. వాయువు - శైత్యోష్ణములు, మందవేగములు, సుగంధదుర్గంధములు, మొదలగు గుణములు గలిగి వీచునదియైనను వాయాయి గుణములు సంసర్గముచే వచ్చినవిగాని స్వతస్సిద్ధములైనవికావు. అట్లే - దేహవిశిష్టుడగు నాత్మకు పురాతనాధునాతన కర్మవశంబున సంభవించు ఖేదమోదములు సుఖదుఃఖములు మొదలగు వికృతులెల్లను అజ్ఞానోదయమున కలిగినవేకాని సహజములు కావు.

7. ఆకాశము - స్థావరజంగమ స్వరూపమైన సమస్తజీవకోటి పదార్థములందును నావృతమై యున్నను ఏ పదార్థముతోను లగ్నముగాక వేరుగా నున్నట్లు పరమాత్మ సమస్త

జీవ సముదాయమందు నిండియుండినను వాని యన్నిటితో సంసర్గము లేక వేఱుగా నున్నదనియును, ఆకాశము మేఘాదులను దాకక మెఱుపులనంటక యుండునట్లు, పరమాత్మయు కాలవశంబున దనకు సంప్రాప్తించు నుదయలయాదులను బొందకుండ నుండును.

8. సూర్యుఁడు – తననూఱు కిరణకాంతులచే జలముల నాకర్షించి తాను మాత్రము కొంచెమైన నుపయోగించుకొనక తిరిగి తన సహస్రకిరణజాలముద్వారా భూమిమీదికి వదలివేయునట్లు (ముముక్షువు) తన జ్ఞానేంద్రియములచే (చెమట మొదలైనవి) గ్రహింపబడిన శబ్దాది విషయముల మనస్సునందు స్థిరపరుపక తొలగించుకొన వలయును.

9. చంద్రుడు – వృద్ధిక్షయములు చంద్రుని కళలకేగాని చంద్రునకు లేనట్లే షడ్భావాది వికారదోషములు దేహమునకేగాని యాత్మకులేవు.

10. పావురము – తన పెండ్లామును పిల్లలను పెంచుటకై ఆహారము తేనరిగి యచట వలలో జిక్కి మరణించునట్లు ముముక్షువు తనవారిని భగవత్సంతతియను కొనక మమకారాదులచే బద్ధుడై మానవజన్మంబును దుర్లభమని యెంచక సంయోగ వియోగములచే దుఃఖసాగరమున నిమగ్నుడై చనిపోయి తరువాత దుస్తరమైన సంసారసాగరమున బడి జన్మంబు లెత్తుచు నిరంతరము ఖేదము నొందుచుండును.

11. కొండచిలువ:– తన కప్రయత్నముగ లభించు నాహారమునుభుజించి తనివిజెందులాగున జ్ఞానియు తనకు

తక్కువగనో, యెక్కువగనో లభించినపదార్థము రుచియున్నను లేకపోయినను అనుభవింపవలయును.

12. సముద్రము:- ఎల్లప్పుడు గాంభీర్యము ప్రసన్నత గలిగి ప్రవేశమునకును తరించుటకును (దాటుటకు) దుస్సాధ్యమై కలతపాటునొందక నిశ్చలభావమునొంది వర్షకాలమున పెక్కు నదులువచ్చి తనలో చేరినను పొంగక నిండు వేసవిని నీరులేమి యితరనదులేవియు వచ్చి తనలో జేరకున్నను తరిగిపోక యేకరీతిగనే యుండునట్లు ముముక్షువు సదా పైకిప్రసన్నతయు నంతరంగమున గాంభీర్యగుణములు గలిగి యితరులకు లోబడక పరులవలన సంక్షోభము నందక విజ్ఞానవైరాగ్యములచే మనఃస్థైర్యములుగలిగి కర్మవశమున గలుగు లాభనష్టములవిషయమై మోదఖేదములు జెందక సమచిత్తుడై సుస్థిరుడై యుండవలయును.

13. శలభము:- యుక్తాయుక్త పరిజ్ఞానము లేకపోవుట చేత రాత్రులయందు నగ్నినిగని తినుబడి పదార్థభావముతో నందులోబడి నశించునట్లు యుక్తాయుక్తవిమర్శన లేకమూర్ఖుడు స్త్రీలహావభావ శృంగార చమత్కార చేష్టలను గనుగొని భ్రమించి వారికిజిక్కి తుదకు రేవణమై రౌరవాది భయంకర నరకకూపములలోబడి చెడును.

14. వనదంశము:- తేనెటీగ తాననుభవింపక కూడబెట్టిన మధువునంతను లోకులపాలుసేసి తానుచెడురీతిని మితిమీఱిన ధనసంచయ సంపాదనేచ్ఛగలవాడు చెడిపోవునట్లు ముముక్షువెఱింగి తనకు లభించిన పదార్థ మనుభవించి యితర

జీవకోటి కుపయోగ పడుచి నిరంకుశ భావముతో సుఖముగ మెలంగవలయును.

15. మధుకరము:- ఎల్ల పువ్వులలోని పలురకంబులగు మకరందంబులగ్రోలి సంతుష్టిపడువిధంబున యోగి యెప్పుడును మహావాక్యార్థములగ్రహించి తన్మయుడై సంతుష్టిపడవలయును.

16 ఏనుగు:- మగయేనుగు, ఆడేనుగుతో సంభోగ సంపర్కసుఖమునకు మఱిగి లోకులకు వశపడులాగున పరస్త్రీ భోగసుఖము నపేక్షించినచో మోహపాశబద్ధుడై శిక్షితుడ నగుదునని యెఱింగి "మాతృవత్పరదారాంశ్చ" అను నార్యోక్తి బట్టి వర్తింపవలయును.

17 లేడి:- తనచెవులకు నింపుగాసోకిన గానాలాపము నకు భ్రాంతిచెంది బంధములో దగులుకొని నశించునట్లు ముముక్షువు వెలుపలిపాటలకు వశుడై చెడును.

18. మత్స్యము :- గాలపుముల్లున గ్రుచ్చియున్న మాంసాహారమునకై యాసించి చివరకు నిజజీవితమునకు నపాయము దెచ్చుకొనునట్లు ముముక్షువు జిహ్వాచాపల్యము నకు జిక్కి రుచికరములైన పదార్థముల దినదలంచినయెడల దుఃఖపడవలసివచ్చునని తెలిసికొని మెలకువ గలిగియుండవలెను. జిహ్వాచాపల్యము విడువనిచో విషయచాపల్యము విడువదు జిహ్వాచాపల్యమును జయించినచో మిగిలిన యింద్రియములను సులభముగ నరికట్టవచ్చును. సన్మార్గమున సంచరించు సజ్జనుడు సైతము రసనేంద్రియ లోలుపత్వము జయింపనిచో

తదితరేంద్రియము లన్నియు కలసి బలపడి స్థిరచిత్తతను జెడ గొట్టును. రుచిపక్వ విషయములు సుంతయు విచారించక ఆహార మనుభవించుచున్నచో యింద్రియములు తనవశములో నుండును, అప్పుడు జితేంద్రియుడను ప్రసిద్ధిగనును, శరీర మందలి రోగముపోవుటకు మందు నుపయోగించునట్లు శరీర ధారణకొఱకు నాహారము భుజింపవలయును. గీ. కూడు తినరాదటంచును గొందఱయ్యె లేలకోవెత్తి త్రోవల నెఱుక లేక కూడు విడచిన విడచునా కుటిలబుద్ధి. అనువాక్యార్థము జ్ఞప్తియందుంచుకొని వర్తింపవలయును. ఆహారమును బొత్తిగా విసర్జించినచో శరీరమన్నమయము గనుక నది బలహీనత గాంచును. శరీరము బలహీనమగుచో దుర్బలత్వముచే తెలివి తేటలునశించి మనఃస్థైర్యము చెడును. అది నశించినప్పు డాత్మానుసంధానక్రియ సరిగాజరుగదు. అట్ల్యది జరుగనిచో ముముక్షువు తరించుటకు మార్గము లభించదు, కనుక "భిక్షాన్నం దేహరక్షార్థ" మ్మను వాక్యార్థమెఱింగి-యాహారము భుజింపవలయును.

19. వేశ్య - తనను జేరవచ్చిన విటులనెల్లర నటవు టించి ధన సంపాదన చేయుచు నీచపుత్రోవల బోవుచు జాతి నీతులు సరకుగొనక జారపురుషులతో గూడి భోగించుచు వ్యాధి బాధల ననుభవించుచు ఘోరదురితకార్యము లొనరించుచు కుటిలవర్తనమున వర్తించునట్లు జీవుడు బుద్ధియను తరుణీమణితో గూడి యింద్రియము లనెడి మిత్రులతోను విషయములను సఖురాండ్రతోను గూడి సదా వారిని సేవించుచు జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి త్రయీామయావస్థల

యందు కలిగెడి సుఖసంపత్తి ననుభవించి తుట్ట తదకు దురంత క్లేశ ప్రాప్తికి బాత్రభూతుఁడుగాక యుంటయు మఱియు వేశ్యా కాంత తానొక్కనితో సరసములాడుచు వేఱొక్కనితో మంతనము లాడుచు మఱొక్కనితో నలుక గులుకుచు కల హించి యింక నొక్కనితో చక్కనలాడించి భోగించుచు నెల్లవారియందు మిగుల యనురాగము గలిగియున్నట్లు మెల గుచు చిట్టచివర కెవ్వఱికిని మనసీయక మధురవచన రచనలతో నుబ్బించి యూరించుచు నేర్పుతో రొక్కమునంతయు చిక్కు టకే వలయు జతనము సలుపుచు మిక్కిలి చక్కని మెలకువతో మెలగులాగున తాను జననమరణ దుఃఖ పరంపరలకు జన్మస్థాన మైన యజ్ఞానమను మహా ప్రవాహములోఁబడి యహంకార మమకారములను సుడులలో జిక్కి క్రొక్కుడుపాటుపడు చున్నను పురాకృత సుకృతకర్మ పరిపాక విశేషముచే చిత్త శుద్ధి గలవాఁడై, ఔరా! తళుకుబెళుకులు తిలకింపజేయుచు గులుకుపలుకులు పలుకుచు జారపురుషుల వశీకృతుల గావించి వారి కలధనమెల్ల హరించి తుట్టతుదకు పలుదుఃఖముల పాలుసేయు విత్తకాంతవలె మాయాదేవియు వివిధ మానసిక భ్రమలు కల్పించి సుజ్ఞాన సంపద జూఱఁగొని జనన మరణ దుఃఖరూపమైన సంసరణ సాగరమున బడద్రోసి లోకజాలమును నిరంతర దురంత దుఃఖముల పాలుసేయుచున్నది. ఇద్దానిని దాటుటకు నుపాయ మాలోచించి సాధనచతుష్టయ సంపన్నుండై, సద్గురుల నాశ్రయించి వారిని సదాసేవించుచు వారివలన శ్రవణముసు దానివలన మననమును, మననమువలన నిధిధ్యాసమును దానివలన నిశ్చయాత్మ తత్త్వమను సుజ్ఞాన

సంపదను బొందుటకే సర్వకాల సర్వావస్థలయందును లక్ష్య భావముతో సంచరించుచు నటుతర్వాత -

శ్లో॥ "నాహంమనుష్యోనచదేవయక్షో నబ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రాః
నబ్రహ్మచారీ నహివానవస్థో భిక్షోనచాహం నిజబోధరూపః"

అను శ్రుతి వాక్యము ప్రకారము తాను బోధానంద ఘనుడను జ్ఞానము లభించిన పిమ్మట శరీరపతనము గాకుండు నంతవఱకు మబ్బు క్రమ్ముట చీకటిచేయుపనికాదు, చీకటి తొలగినను మబ్బుండవచ్చును. శరీర ప్రపంచము అజ్ఞాన కార్యమే, కార్యము నశించినప్పుడు కార్యమెట్లు నిలుచునని శంకింతువేని ప్రధానకారణమైన వేరు పోయినను కలబంద మాత్రము నిలుచులాగున ముఖ్యకారణమైన నిప్పు చల్లారినను కార్యమైన ధూమము (పొగ) మాత్రము నిలుచునట్లు, ముఖ్య కారణమైన యజ్ఞానము నశించును. తత్కార్యమైన శరీరాది ప్రపంచము కలుగునంతవఱకు నింద్రియములు తమతమ పనుల యందు ప్రవర్తించుచున్నను చిత్తమందు నవ్వాసనల పదిల పడనీయక నిరంతరము స్వస్వరూపమందు చిత్తమును గుత్త ముగ నిలుపగలిగియుండవలయునని నిశ్చయించుకొని యుండ వలయును.

20 కురరపక్షి:- తనపొట్టకై తాను సంపాదించుకొని తెచ్చుకొనిన యాహారమును, తక్కిన పక్షులు తమకాహారము దొరకకపోవుటచే నాహారము తెచ్చికొనిన తమజాతి పక్షిని ముక్కులతో బొడిచి కాళ్ళతోగీరి యనేక బాధలుపెట్టి యాపక్షి సహించలేక దననోటి యాహారము వదలివేసిన తరువాత యా పక్షి జోలికిపోక యది మానుకొనిన చందంబున నిర్గుణయోగి

దేహమును ప్రాణేంద్రియములు మనస్సు మొదలగువాని ధర్మ ములనెల్ల దనయం దారోపణచేసికొని ప్రకృతి గుణసంగమున దిట్టముగఁ గట్టబడి తానెట్టివాఁడో నెఱుంగమింజేసి సంసార భారమును నిర్వహించుటకై రాత్రిందివములు శ్రమపడుచు వివిధ కర్మములుచేసి తత్తత్కర్మానుగుణ్య పరంపరగా వచ్చు దేవమానవ తిర్యగాది జన్మములనెత్తి స్త్రీయో, పురుషుఁడో నపుంసకుఁడో, మఱియొండో యేదోయొక రూపధారియై వర్తిం చును. కుక్క యాఁకలిబాధచే ప్రతిగృహమందు జొచ్చి పట్టెడు కబళమో మఱియొకటియో లేక దండతాడనము (కట్ట దెబ్బలు) పొందునట్లు కర్మవశమున సుఖదుఃఖములు ఖేదమోదములు మొదలగునవి యనుభవించుచు దారాపుత్రా దులు తృప్తిలేనివారు కావున వారికై దుష్కర్మలెన్నియో చేయుచు దురంతదురితజాలము సంపాదించుకొనుచు రాను రాను సుకృత పరిపాక ఫలవశంబున గురుకులవాసముచేసి వారివలన శరీరాదులు నిత్యములుకావు శుద్ధములునుగావు, జడప్రాయములు, దుఃఖాలయములు, దృశ్యములు, దురిత శర ణంబులు వికార పూరితములు, పరిచ్ఛిన్నములు, సంకల్పవికల్ప మయములు, ఆధేయభూతములు, అవయవ విశిష్టములు, ఆద్యంత సహితములు, సజాతీయవిజాతీయ స్వగతభేద సహి తములు, మఱియు తదీయకార్యములు గుణగణ విశిష్టములయి యుండుననియు, సమష్టివ్యష్టి స్వరూప రూపితమగు శరీర త్రయమే యనాత్మయనియు వీనికన్నిటికన్న విలక్షణమై యనగా నిత్యము పరిశుద్ధము, సత్తు, సుఖము, అదృశ్యము, నిర్వి కారము, నిరంజనము, అపరిచ్ఛిన్నము, స్వప్రకాశము, సంకల్ప వికల్ప రహితము, ఆధారభూతము నిరవయవము, ఆద్యంత

రహితమునై యుండునది యాత్మయనియు అట్టి యాత్మయే తానని నిర్ణయముచేసికొని తదాత్మావలోక నేచ్ఛాపరాయణుడై యుండుటయే సౌఖ్యదాయకమనియు తెలిసి యోగిజనుడు వర్తింపవలయును.

21. బాలుడు:- అజ్ఞానియగుటచే మానావమానములు సుఖదుఃఖములు ఖేదమోదములు మొదలగువాని నెంచక తన యాటలయందే యాసక్తికలవాడై ఆనందించు విధంబున ముముక్షువు జ్ఞానియైనను సుఖదుఃఖాదులు శరీరమునకేగాని పరమాత్మ స్వరూపమునకు లేవనియు బరమాత్మ ధ్యానమే నిత్యమని తెలిసికొని నిర్వికారుడై పరబ్రహ్మైక్యానుసంధానపరతచే లభించునట్టి యానంద సాగరమున క్రీడించుచుండవలయును.

22. కన్యక:- మిక్కిలి పేదకుటుంబములో పుట్టిన యొక కన్యక గ్రహచారవశాత్తు తనయింటికి చుట్టాలు కొందఱు వచ్చిన జూచి వారిని తగుమర్యాదచేసి వంటచేసి పెట్టుటకు నింటిలో తండులంబులు లేనందున ధాన్యము దంపుటకు మొదలుపెట్టెను. దంచునప్పుడు తన మోజేతులనున్న గాజులు గల్లుగల్లుమని మ్రోయ చికాకుచెంది గాజులు చాలా చేతులనున్నందున చప్పుడగుచున్నదని తెలిసి గాజులలో గొన్ని పగులగొట్టి పాఱవేసి చేతికి రెండేసి గాజుల చొప్పున నుంచుకొన్నది. అట్లయినను మఱల దంచుటకు మొదలిడగా మఱల మ్రోయగా, సువాసినీ స్త్రీధర్మమునకు చేతికి ఒక్కొక్కటి వంతున యుంచుకొని దారిద్ర్యావస్థా సూచకములగు కరకంకణ ధ్వనులు విరమించినందులకై యెంతయు సంతస పడుచు

నిజకార్యముల నిర్విచారముగ నెఱవేర్చుకొన్నట్లు ముముక్షువు గూడ యితరులతో ముద్దుముచ్చటల మురిసినచో తనగుట్టు చెడి కలహ కార్పణ్యాదులు కలిగి చిత్తవ్యథ సమాయత్తమగు నని గ్రహించి స్వస్వరూప సందర్శన లాలసులుకాని జడ ప్రాయులతో జేరక కలహాది నివారకమగు సదసద్వివేక విమర్శకుడై యుండవలయును.

23. వ్యాధుఁడు:- తాను పీనులవఱకు విల్లునెక్కుబెట్టి లక్ష్యద్రష్టయైయున్న సమయమున తనయజమానివచ్చి యెట్టయెదుట నిలిచియున్నను దిలకింపక లక్ష్యమునకై తదేకధ్యాన తత్పరుడై యుండునట్లు ముముక్షువును తదేకధ్యానముతో మనస్సు నరికట్టి యితరచింతలు విడిచి పరమాత్మయందే దృష్టి నిలుపవలయును.

24. సాలీఁడు:-శ్లో. "ఊర్ణనాభిర్యథాతన్తూన్ సృజతే" అను వాక్యప్రమాణమున తనకు దొరకిన పదార్థముతోడనే తన్తు నిర్మాణమొనర్చుచు తాను నిర్మించిన తంతువులకంటె వేఱుగనుండి క్రీడించుచుతిరిగి యాతంతువుల భక్షించుచు నుపాదాన నిమిత్త హేతువులు తానైయొప్పునట్లు సర్వశక్తి సంపన్నుడైన భగవంతుడు నైజమాయచే చరాచరాత్మకమయిన ప్రపంచము నెల్లను సృష్టిచేసి యాప్రపంచముకంటె తాను వేఱైయుండును. ప్రపంచ సంబంధములగు సుఖదుఃఖములు, పుణ్యాపాపములు ఖేదమోదములు మొదలగునవి తాననుభవింపక క్రీడసలుపుచు తిరిగి వానినెల్ల లయ మొనర్చుచు నెల్లవానికి తానొక్కడే హేతుభూతుడై వర్తించుచున్నట్లు ముముక్షువును పరబ్రహ్మనిష్ఠా యుక్తుడై

యుండునపుడును ప్రపంచాభిముఖుడై నను మతిచాంచల్యము లేనివాడై సాలీనివలె సంచరింపవలయును.

25. పాము :- తానెల్లప్పుడు తోడుగూడక నొంటరిగ దిరుగుచు తన విషపాదవిన్యాసముల అస్తి నాస్తి భావములు దెలిసికొనుటకు వీలుకానంత వేగమున భరువెత్తుచు మిత భావముగా అప్పుడప్పుడు బుసకొట్టుచు కాలమును గడుపు లాగున జ్ఞానమానవుడు ముముక్షుత్వమే యభిలషించుచు "ఏకాన్తేన శ్రవణార్థానుసంధానం భవతి" అను నుపనిషద్వా క్యానుసరణమున శ్రవణమున (వినుటచే) సిద్ధమైన దృశ్యాదృశ్య ములను మఱచిపోయి స్వస్వరూప సందర్శన మాత్రమున నిలిచి సుఖియై తానజ్ఞానికాని అజ్ఞానికాని స్మృతిమంతుడుగాని విస్మృతికలవాడనికాని యితరులకు తెలియనట్టి నడవడితో నడచుచు మితభాషియై నిర్విచార మానసుడై యుండవలెను.

26. భ్రమరమను కీటము కుమ్మరిపురుగును దెచ్చి తనగూటియందు బెట్టుకొని ఝుంకారముతో నా పురుగు చుట్టును దిరుగునప్పు డా కుమ్మరిపురుగు భయపడి తనదృష్టి యంతయు నా కందిరీగయందే నిలిపి చివరకు దానిరూపమును పొందునట్లు (తానొక కందిరీగ నయినట్లు) ముముక్షువు దేహామియ్యది స్థిరముకాదు, ఏవేళనో, ఎచ్చోటనో జాగ్ర త్స్వప్న సుషుప్తులయందో ఆహార సమయముననో ఎప్పుడో యొకప్పుడు పోవునదికాని స్థిరముగ నుండునది కాదుకదా అని కొని పురుగుమీది తన లక్ష్యభావమును పరమాత్మధ్యాని స్వస్వరూపసందర్శన లాలసుడై స్థిరచిత్తుడై నిలిచిన సచ్చి నంద పరబ్రహ్మస్వరూపుడై జీవన్ముక్తుడగును. వైకుంఠస్వా

చెప్పిన మహావాక్య ప్రపంచమునంతయు నాలించి పరమా
నంద భరితమానసులై నారద శివబ్రహ్మాదులు శ్రీస్వామి
వారిని యిట్లు స్తుతించిరి

శ్లో॥ నమోఽనంతాయ సూక్ష్మాయ, కూటస్థాయ విపశ్చితే
నానావాదానురోధాయ వాచ్యవాచకశక్తయే
నమః ప్రమాణమూలాయ కవయే శాస్త్రయోనయే॥

గీ. పొదలు మూఁడహంకృతులచే ముసుఁగువడక
నెఱిఁ ననంతుడవై దర్శనీయరుచివి
గాక సూక్ష్ముఁడవై నిర్వికార మహిమ
దనరి కూటస్థుఁడన సమస్తంబు నెఱుఁగు
నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ.

మఱియుఁ గలండు, లేఁడు, సర్వంబు నెఱుంగు నించుక
నెఱుంగు, బద్ధుండు ముక్తుం డొకం డనేకుండునను నివి
మొదలుగాగల వాదంబులు మాయవలన ననురోధింపుము
కావున నానా వాదా నురోధకుండవయ్యు నభిధానాభిధేయ
శక్తి భేదంబువలన బహుభావ ప్రతీతుండవయ్యును జతురాది
రూపంబులవలన బ్రమాణమూలకుండ వయ్యు నిరపేక్షజ్ఞానంబు
కలిమిఁ గవి వయ్యు వేదమయ నిశ్వాసంబువలన శాస్త్ర
యోనివి.

శ్లో॥ మతిర్నకృష్ణే పరతస్స్వతో వా మిథోఽభిపద్యేత గృహవ్రతానాం
అదాంతగోభిర్విశతాం తమిస్రం పునఃపునశ్చర్వితచర్వణానామ్॥

ఉ. అచ్చపుఁజీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁబుట్టుచున్ మఱలఁ జర్విత చర్వణులైనవారికిం

జెచ్చెఱఁబుట్టునే పరులు సెప్పినసైన నిజేచ్ఛనైన నే
మిచ్చినసైనఁ గానలకు నేఁగినసైన హరిప్రబోధముల్.

క. భూషణములు సెవులకు నఘ
పేషణములు మృత్యుచిత్త భీషణములు హృ
త్తోషణములు కల్యాణ వి
శేషణములు హరిగుణోపచిత భాషణముల్.

క. పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మీసం
భావనములు వాసుదేవ పదసేవనముల్.

శ్లో॥ యస్యాత్మనీదం నిజమాయయార్పితం
క్వచి ద్విభాతం క్వచత త్తిరోహితం
అవిద్ధదృక్సాక్ష్యుభయం తదీక్షతే
స ఆత్మమూలోఽవతు మాం పరాత్పరః.

కం. ఒకపరి జగములు వెలినిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముగనుచుం
సకలార్థసాక్షియగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థింతు మదిన్.

శ్లో. దిదృక్షవో యస్యపదంహి మంగళం
విముక్తసంగా మునయ స్సుసాధవః
చరంత్యలోకవ్రత మవ్రణం వనే
భూతాత్మభూతా స్సుహృద స్సమేగతిః.

తే. గీ. ముక్తసంగులయిన మునులు విద్యుత్తులు
సర్వభూతహితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కునాకు.

శ్లో॥ జయతి తేఽధికం జన్మనావ్రజః
శ్రయత ఇందిరా శశ్వదత్రహి।
దయిత దృశ్యతాం దిక్షు తావకా
స్త్వయిధృతాసవ స్త్వాం విచిన్వతే॥

క. నీవుజనించిన కతమున
నోవల్లభ లక్ష్మి మంద నొప్పె నధికమై
నీవెంటనె ప్రాణములిడి
నీవా రరసెదరుచూపు నీరూపంబున్.

వ. దేవా! సమాధియును సమాధి గృహనిర్మాణము సమాధి గతజన విశేషాదులు వచింప వినగుతూహలురమై యున్నాము. వెనువెంట యానతీయవేయని వారు ప్రార్థించుటయు వైకుంఠస్వామి సమ్మతించుటయు నన్నది ప్రథమోల్లాసము.

శ్రీభగవదర్పణమస్తు.
సర్వేజనా స్సుఖినోభవంతు
శ్రీ శ్రీ శ్రీ

## గద్యము

ఇది శ్రీమద్గౌతమ్యంతర్భూత భారద్వాజ తటినీ తటనివిష్ట విద్వత్కుంజర వింజరగ్రామాగ్రహార వాస్తవ్య భారద్వాజపవిత్రగోత్ర ద్వివేదివంశ పయఃపారావార రాకా సుధాకర పరదేవతా కాత్యాయనీ ప్రత్యక్షసాక్షాత్కారలబ్ధలబ్ధ వర్ణవర్ణనీయ సకలవిద్యావైశద్య బాలపతంజలి వ్యాకరణషరాబు ప్రముఖబిరుదావళీ విరాజిత సాష్టాదశపరగణాయుత పెద్దాపురీపరిపాలక విద్వత్తిమ్మగజపతి మహారాజ మానసంరక్షక తద్దత్త హేమసింహాసన శిబికాధిరోహక నవద్వీపాగతోద్దండ పండిత విజేతృ పండితనారాయణశాస్త్రి ప్రపౌత్ర, కొండయాపర నామధేయ రామచంద్రశాస్త్రి పౌత్ర, నాగాంబా గర్భశుక్తి ముక్తాఫలాయమాన వెంకటరామాంతర్వాణి తనూభవ మద్రమండల పరిషత్పరివృఢదత్త బాలసరస్వత్యుభయభాషా కవి, శివనాడీప్రముఖ నవనాడీ ప్రవీణ సాకేత నగరపరిషదాది ప్రదత్త సాహిత్యరత్న, కవిరత్న, భిషగ్రత్న, ప్రబంధక, దైవజ్ఞభూషణ బిరుదవిరాజి పండిత నారాయణశాస్త్రి సంకలిత 'స్త్రీఅభాగిని' అను సత్యగీతయందుఁ బ్రథమోల్లాసము ముగిసినది.

ఓమ్ తత్సత్ పరబ్రహ్మార్పణమస్తు.

---

ఓం నమః పరస్మై

# "స్త్రీ అభాగిని"

## (అను)

# సత్యగీత

## ద్వితీయోల్లాసము



### ధ్యానమందిర లక్షణము

వ॥ అక్కథకుండు నారద శివబ్రహ్మాదులకు వక్ష్యమాణ విధంబున వక్కాణించుచున్నాఁడు.

శ్లో॥ అల్పద్వార మరన్ధ్రగర్త వివరం నాత్యుచ్చనీచాయతం
సమ్యగ్గోమయ సాన్ద్రలిప్తమమలం నిశ్శేష జంతూజ్ఝితం,
బాహ్యే మణ్టపవేది కూపరుచిరం ప్రాకార సంవేష్టితం
ప్రోక్తం యోగగృహస్యలక్షణమిదం సిద్ధైఃహఠాభ్యాసిభిః॥

తా. యోగగృహము అనగా భగవంతుని ధ్యానము చేయుటకు నిర్మించిన యిల్లు పెద్దది, చిన్నది కాక మధ్యరకమైనదియు, మెఱక, పల్లము లేనిదియు, ఎలుకలు, నల్లులు దోమలు లేకుండ చేయబడినదియు, గోమయముచే చక్కగా అలకబడినదై వెలుపల అరుగుకలదియై చుట్టు ప్రాకారపుగోడలు గలదియై యుండవలయును. మిగుల పెద్దదియైనచో దృష్టిదూరమునకు ప్రసరించును. అందుచే చిన్నద్వారములున్నా గవాక్షములుకలిగి మధ్యరకముగనుండవలయును.

నందికేశ్వర పురాణ సంహిత,

శ్లో॥ మన్దిరం రమ్యవిన్యాసం మనోజ్ఞం గన్ధవాసితమ్
ధూపామోదాది సురభి కుసుమోత్కర మణ్డితమ్
మునితీర్థ నదీవృక్ష పద్మినీశైల శోభితమ్
చిత్రకర్మనిబద్ధంచ చిత్రభేద విచిత్రితమ్

కుర్యాద్యోగగృహం ధీమాన్ సురమ్యం శుభవర్త్మనా
దృష్ట్వాచిత్రాగతాంశ్చాంతాన్ మునీన్యాతి మనశ్శమమ్
సిద్ధాన్ దృష్ట్వాచిత్ర గతాన్ మతిరభ్యుద్యమే భవేత్
మధ్యేయోగగృహస్యాథ లిఖేత్సంసారమండలమ్

శ్మశానంచ మహాఘోరం నరకాంశ్చ లిఖేత్క్వచిత్
తాన్దృష్ట్వాభీషణాకారాన్ సంసారేసారవర్జితే
అనవసాదోభవతి యోగీసిద్ధ్యభిలాషకః
పశ్యంశ్చవ్యాధితాన్ జన్తూన్ నతూన్మత్తాంశ్చలద్ర్వణాన్॥

తా. యోగాభ్యాస గృహము సమచతురముగను, రమణీయముగను, మనోజ్ఞముగను, సువాసన గలదిగను, ధూప దీపాదులతోడగూడి పుష్పమాలికలు మొదలగు వానిచే నలంక రింపబడినదిగను, ఋషులు, తీర్థములు, నదులు, వృక్షములు, తామరలతలు వాపీకూప తటాకములతో గూడినదిగను, చిన్న కొండలతో గూడినదిగను శోభాయ మానముగను, చిత్ర ముగ గూర్పబడి నదిగను, పలువిధములైన చిత్రములతో జిత్రింపబడి నదిగను, మనోజ్ఞమైనదిగను యోగగృహమును జ్ఞాని నిర్మించు కొనవలయును. చిత్రింపబడిన బొమ్మలను జూడగా మనస్సు ప్రయత్నించుటకు ప్రకోపించును. చిత్రము లందలి మునుల స్వరూపముల గాంచి మనస్సు శాంతికలది యగును. యోగాభ్యాస గృహమధ్యమున సంసార మండల మొకటి లిఖింప వలయును. మఱియొక శ్మశానమును

ఘోరనరకములను వ్రాయవలయును. రోగుల నున్మత్తుల వ్రణ రోగుల వ్రాయవలయును. ఇవియన్నియు జూచి యోగి సంసార వాంఛ విసర్జించును. మఱియు యమ నియమాదులతో గూడినవాడు సంగముత్యజించి చదువుకొని సత్యవంతుడై కోపములేక ప్రసన్నుడై గురుశుశ్రూష చేయుచు తలిదండ్రులచే శిక్ష నొందుచు తానుండెడి యాశ్రమమునకు వలయు ధర్మములను జేయుచు సదాచార సంపన్నుడై మహాయోగులకు జ్ఞానుల సన్నిధి నుపదేశము నందినవాడై ఫలవృక్షములు కందమూలములు జలప్రదేశములు పుష్పవృక్షములు మొదలగునవి కలిగిన చక్కని తపోవనమునందు స్వధర్మముల నాచరించు బ్రహ్మవిదులతో గూడి గోమయముచే నలకబడి సర్వవిధంబుల మంగళప్రదముగ శోభిల్లుచు వేదఘోష కలిగియుండు క్షేత్రమునగాని. నదీతీరమందుగాని, నగరమునగాని, గ్రామమందుగాని హెచ్చుతగ్గులులేక సమమట్టముగనుండి రమ్యముగానుండునట్లు యోగగృహమును నిర్మించి యందు తాను సదా వేదాంత శ్రవణము నొనర్చుచు యోగాభ్యాసము చేయ వలయును. శాండిల్యోపనిషత్తునందును శివయోగ దీపికాది మహా గ్రంథములయందును యోగ గృహలక్షణ మిట్లు చెప్పబడి యున్నది. హఠసంకేతమునందు-యోగమందిరము గాలివెడలునట్టి గుహగాను, నాలుగు బారల వెడల్పును నాలుగు బారల పొడవును గలిగి వర్తులాకారమగు ద్వారము కలదై దేహదోషములను వాయుదోషములను పోగొట్టునదిగను నాడులయందలి మలమును శుద్ధిగావించి లోపల వికాసము నిచ్చునదిగను చిత్తస్థైర్యమును గలిగించునదిగను యుండవలయునని చెప్పబడి యున్నది. ధ్యానగృహమందు నూనె దీపము పనికిరాదు. నూనె

దీపమును జూచినచో తాను చక్కగ కుంభించిన వాయువు శీఘ్రముగ వేఱుత్రోవను వెడలిపోవును. అందుచే ఘృత దీపము (నేతి దీపము) పెట్టవలయును. ధ్యానమందిరమున ధ్యానముతప్ప మఱియొకపని చేయగూడదు.

శ్లో॥ ఏవంవిధేగృహేస్థిత్వా సర్వచిన్తా వివర్జితః
గురూపదిష్టమార్గేణ యోగ మేవ సమభ్యసేత్.

వెనుక చెప్పిన లక్షణములతో గూడిన ధ్యాన గృహమందు చింతలన్నియు త్యజించి గురువు ఉపదేశించిన విధంబున యోగాభ్యాస మొక్కటియే చక్కగా నాచరింప వలయును. మఱియు తక్కినవన్నియు యోగాభ్యాసమునకు విఘ్నకారకములని తెలిసికొనవలయును.

శ్లో॥ మరుజ్జయో యస్యసిద్ధ స్తం సేవేత గురుం సదా
గురువక్త్ర ప్రసాదేన కుర్యాత్ప్రాణజయం బుధః

వివేకవంతుడు వాయు జయసంపదగల గురువరుని సన్నిధి వర్తించి వానికి సదాసేవాదిక మొనర్చుచు నాగురు ప్రసాదముచేతనే వాయుజయము చేయవలయును.

బీజగ్రంథ మందిట్లున్నది.

శ్లో॥ "వేదాన్తతర్కోక్తిభిరాగమైశ్చ నానావిధైశ్శాస్త్రకదమ్బకైశ్చ
ధ్యానాదిభిస్సత్కరణైర్నగమ్య చిన్తామణిం హ్యేకగురుం విహాయ"

తా. చిన్తామణివంటి యొక్క గురువులేక తక్కిన వేదాంత తర్కవచనములచేతను ధ్యానాది సత్కర్మలచేతను ఆగమములచేతను నానావిధములగు శాస్త్ర సమూహాముల చేతను దెలిసికొదగినదికాదు

---

## ప్రాణాయామాభ్యా సావశ్యకము

శ్లో॥ బ్రహ్మాదయో౽పి త్రిదశాః పవనా౽భ్యాసతత్పరాః
అభూవన్నన్తక భయా త్తస్మా త్పవనమభ్యసేత్॥

తా. బ్రహ్మాదిదేవతలును యముని భయమువలన రేచకపూరక కుంభక భేదములుగల ప్రాణాయామానుష్ఠానమందు నాసక్తిగలవారై యుండిరి కాబట్టి సర్వులు దాని నభ్యసింపవలయునని తెలియుచున్నది. స్వల్పకాల భయము వలన బ్రహ్మదేవుఁడు సైతము ప్రాణాయామమును అభ్యసించి నాఁడనియును కాబట్టి యోగిజనులును మునులును ప్రాణాయామము చేయవలయుననియు యోగచూడామణ్యుపనిషత్తునందుఁ జెప్పబడియున్నది. పలువిధములయిన యోగములు ప్రాణాయామము వలననే సిద్ధించుచున్నవనియు ప్రాణాయామము లేని యోగములన్నియు నిష్ఫలములనియు రాజసిద్ధాంత రాజయోగ గ్రంథమందుఁ జెప్పబడియున్నది.

శ్లో॥ యావద్బద్ధో మరుద్దేహే యావచ్చిత్తం నిరాకులమ్
యావద్దృష్టిర్భ్రువోర్మధ్యే తావత్కాలం భయం కుతః॥

తా. ఎంతకాలము వఱకు శరీరమునందు ప్రాణవాయువు కట్టువడి (శ్వాస - ఉచ్ఛ్వాస క్రియలు లేక) యుండునో. ఎంతకాలము చిత్తము వ్యాకులముఁజెందక (స్థిరముగ) తదేకాగ్రముగ నుండునో ఎంతకాలము రెండు కనుబొమ్మల మధ్య దృష్టి అంతఃకరణ ప్రవృద్ధియుండునో అంతకాలము వఱకు యమభయము లేదు.

"బాధ్యతే నచకాలేన బాధ్యతే నచకర్మణా
సాధ్యతే నసకేనాపి యోగీయుక్తస్సమాధినా.

తా. సమాధితో గూడియున్న జ్ఞానియముని చే కబళింపబడడు - కర్మములచేఁ బీడింపఁబడడు, దేనిచేతను సాధింపబడడు- కాబట్టి స్వతంత్రుడు స్వేచ్ఛాచారి స్వాధీనుడు అని తెలియుచున్నది. దృష్టిశబ్దము జ్ఞానసామాన్యవాచకము.

---

## ప్రాణలయమువలన కాలజయము కలుగును

శ్లో॥ సూర్యాచంద్రమసౌ ధత్తః కాలం రాత్రిం దివాత్మకమ్
భోక్త్రీ సుషుమ్నా కాలస్య గుహ్యమేత దుదాహృతమ్॥

తా. సూర్యచంద్రులిద్దఱును రాత్రిని బవగలును అనుకాలమును చేయుచున్నారు. సరస్వతి యనెడి సుషుమ్న సూర్యచంద్రులచే చేయబడు రేయుంబవళ్ళను కాలమును దినుచున్నది. ఇది రహస్య విషయముగా చెప్పబడినది.

రెండున్నర ఘడియలకాలము సూర్యుడును, రెండున్నర ఘడియలకాలము చంద్రుడును గమన మొనర్చుచున్నారు. సూర్యుడు నడచునప్పుడు పగలనియు చంద్రుడు నడచునప్పుడు రాత్రియనియు చెప్పఁబడుచున్నది. లౌకికులయొక్క రేయుంబవలునందు జ్ఞానులకు ద్వాదశ దివారాత్ర పరిమితిగల కాలము గమన మొనర్చుచున్నది. అట్టి కాలగమనమునుబట్టి జీవులకెల్లరకు ఆయుఃప్రమాణము ఏర్పడుచున్నది సుషుమ్నా మార్గముచేత వాయువు బ్రహ్మరంధ్రమునందు సంచరించు

నప్పుడు రేయింబవళ్ళు లేనందున సుషుమ్న కాలమును భుజించు చున్నది. అనగా హరించుచున్నదని భావము.

బ్రహ్మరంధ్రమునందు వాయుసంచార మున్నంతకాల మును జ్ఞానులకు దీర్ఘాయుర్వృద్ధి యొప్పుచున్నది. దీర్ఘ కాలము సమాధినిష్ఠుడైన జ్ఞానయోగి ముందుగనే తన మరణకాలమును దెలిసికొని బ్రహ్మరంధ్రమునందు వాయువు నరికట్టి యముని జయించుచున్నాడు. అనగా స్వేచ్ఛగా దేహమును విడుచు చున్నాడు.

శ్లో॥ ద్వాసప్తతి సహస్రాణి నాడీద్వారాణి పఞ్జరే
సుషుమ్నా శాంభవీశక్తిః శేషాస్త్వేవనిరర్థకాః॥

తా॥ పంజరమునందు పంజరమువలె నరములు, ఎము కలు మొదలగు వానిచే కట్టబడియుండు, డెబ్బది రెండు వేల నాడీద్వారములు (వాయువు ప్రవేశించుమార్గములు) ఉన్నవి. వాని యన్నింటిలో సుషుమ్నయను మధ్యనాడి శాంభవీశక్తి నామముగలది. అనగా భక్తులకు శం=సుఖము, భవతి=కలుగు చున్నది. లేక శం=సుఖస్వరూపమై భవతి=ఉన్నది. మఱియు శంభు=ఈశ్వరుని సంబంధమైనది. ధ్యానమార్గముచే శంభు= ఈశ్వరుని పొందచేయునది. ఆత్మసాక్షాత్కారము కలిగించు చున్నది. లేక శంభువనెడిది ఆత్మది. డెబ్బదిరెండువేల నాడుల లోను సుషుమ్న, ఇడా, పింగళ, కుహు, సరస్వతి, యశస్విని, పూష, విశ్వోదర, వరుణ, హస్తిజిహ్వ, పయస్విని, శంఖిని, గాంధారి, అలంబుస, అను నీపదునాలుగు నాడులును శ్రేష్ఠ ములైనవి, వానిలో సుషుమ్న, ఇడ, పింగళ యనెడి మూఁడు నాడులు ప్రధానములైనవి. మూఁటిలో సుషుమ్న శ్రేష్ఠతమ మైనది, దీనినే బ్రహ్మనాడి యందురు.

## ౧౪. నాడుల వివరణము.

౧. వీఁపుయొక్క మధ్యయందు వీణాదండమనెడి యెముకల గూడొకటి శిరస్సువఱకును నెలకొనియున్నది. ఆ యెముకలగూడైన మేరుమధ్యమున శిరస్సుయొక్క నడుమదూరి భ్రూమధ్యము వఱకును నుండుసూక్ష్మమైన ద్వార మొకటి యున్నది. అదియే బ్రహ్మనాడి యనెడి సుషుమ్న.

౨. ఇడ:- బ్రహ్మనాడికి యెడమవైపున యెడమముక్కురంధ్రమున నుండును. శివుడు దేవత.

3. పింగళ:- బ్రహ్మనాడికి కుడివైపున కుడిముక్కు రంధ్రము ఉండును. బ్రహ్మ దేవత.

౪. కుహు:- బ్రహ్మనాడికి ముందఱనుండి గుహ్యస్థానము వఱకు నుండును. దేవత అగ్ని, పృథివి.

౫. సరస్వతి:- బ్రహ్మనాడికి వెనుకనుండి నాలుక వఱకు నుండును. దేవత విరాట్టు.

౬. హస్తిజిహ్వ:- ఇడకు ముందుండి యెడమకాలి పెద్దవ్రేలు వఱకును నుండును. దేవత వరుణుఁడు.

౭. గాంధారి:- ఇడకు వెనుకనుండి యెడమకంటి వఱకు నుండును. దేవత చంద్రుడు, ఇంద్రుడు.

౮. యశస్విని:- పింగళకు ముందుండి కుడికాలి పెద్దవ్రేలు వఱకు నుండును. దేవత సూర్యుఁడు, బ్రహ్మ.

౯. పూషః- పింగళకు వెనుకనుండి కుడికంటివఱకు నుండును. దేవత- దిక్కు, ఈశ్వరుఁడు.

౧౦. విశ్వోదరః- హస్తి జిహ్వా కుహూలకు మధ్యయుండి ముఖమువఱకు నిండియుండును.

౧౧. వరుణః- యశస్విని, కుహూలకు నడుమనుండి క్రిందు మీదుగా దేహమంతటను నెలకొనియుండును.

౧౨. పయస్విని:- పూషా-సరస్వతులకు మధ్యనుండి కుడి చెవివఱకు నుండును. దేవత-ప్రజాపతి.

౧౩. శంఖిని:- గాంధారి, సరస్వతి అను రెంటికి నడుమనుండి యెడమచెవి వఱకు నుండును. దేవత-చంద్రుఁడు.

౧౪. అలంబుసః- కందమధ్యమందుండి గుదప్రదేశమువఱకు నుండును. దేవత-వరుణుఁడు-సూర్యుఁడు.

ఈ పదునాలుగు నాడులు కందమునుండి రావియాకు యొక్క చిన్నియీనెలవలె శాఖోపశాఖలుగా వ్యాపించి యుండును.

---

## సమాధి పర్యాయపదములు

శ్లో॥ "రాజయోగః సమాధిశ్చ ఉన్మనీచ మనోన్మనీ
అమరత్వం లయస్తత్త్వం శూన్యాశూన్యం పరంపదం.
"అమనస్కం తథాఽద్వైతం నిరాలమ్బం నిరఞ్జనం
జీవన్ముక్తిశ్చ సహజా తుర్యాచేత్యేకవాచకాః.

తా. రాజయోగము, సమాధి, ఉన్మని, మనోన్మని, అమరత్వము, లయము, తత్త్వము, శూన్యాశూన్యము, పరమపదము, అమనస్కము, అద్వైతము, నిరాలంబము, నిరంజనము, జీవన్ముక్తి, సహజము, తుర్యము - ఇవి సమాధిపదపర్యాయ వాచకములు.

---

## సమాధి లక్షణము

శ్లో॥ "సలిలే సైన్ధవం యద్వ త్సామ్యం భవతియోగతః
తథాచ మనసో రైక్యం సమాధి రభిధీయతే.
"యదా సంక్షీయతే ప్రాణో మానసంచ ప్రలీయతే
తదా సమరసత్వంచ సమాధి రభిధీయతే."
"తత్సమంచద్వయో రైక్యం జీవాత్మ పరమాత్మనోః
ప్రణష్ట స్సర్వసంకల్పః సమాధిస్సోఽభిధీయతే."

తా. ఉప్పునీటిలో చేరుటవల్ల నెటు లేకీభావము పొందుచున్నదో, ఆ ప్రకారముగా ఆత్మకు మనస్సునకు కలిగెడి యైక్యమే సమాధి. ప్రాణము క్షీణించి మనస్సు లీనమగుచుండ నప్పుడు సంభవించెడి సామరస్యమే సమాధి. "జీవాత్మ పరమాత్మల యిద్దఱియొక్క ఏకీభావము కలిగి నప్పుడు సకల సంకల్పములు నశించుట సమాధి.

---

## సమాధిపొందినవాని లక్షణము

శ్లో॥ అంతశ్శూన్యో బహిశ్శూన్యః శూన్యఃకుంభ ఇవాంబరే
అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంబరే॥

తా॥ అంతఃకరణమున శూన్యము. వెలుపల శూన్యము. బ్రహ్మపదార్థమునకు వేఱొక వ్యాపారములేదు గనుక దర్శనాభావమువలన ఆకాశమందుండు కుంభకము లోపలను వెలుపలను శూన్యమయియుండును. సముద్రమునందుండు ఘటము సదా సంపూర్ణముగా జలముచే నిండియుండు విధంబున సమాధిస్థితజ్ఞాని బ్రహ్మపూర్ణు డగుచున్నాఁడు

శ్లో॥ కర్పూర మనలే యద్వ త్సైంధవం సలిలే యథా
తథా సంధీయమానంచ మన స్తత్త్వే విలీయ తే॥

తా. అగ్నిసంపర్కముచేత కర్పూర మగ్నిరూపమగునట్లు జల సంపర్కమువలన ఉప్పు జలమయమగునట్లు ఆత్మతత్త్వమందు లీనమగు మనస్సు, ఆత్మాకారమగును.

---

## నా ద ల క్ష ణ ము

"ఆదౌ జలద జీమూతభేరీ ఝర్ఝర సంభవాః
మధ్యేమర్దల శంఖోత్థాఘంటా కాహళజా స్తథా.

తా. బ్రహ్మరంధ్రమునందు ప్రాణవాయువు చొరపడునపుడు, మేఘము, భేరీ, ఝర్ఝరము (వాద్యవిశేషము) మొదలుగువానివలన గలుగు ధ్వనిని బోలు నాదరూపమును, నడుమ ప్రాణవాయువు నిలిచిన తదుపరి మద్దెల - శంఖము ఘంట, కాహళము మొదలగువాని ధ్వనివంటి ధ్వనియు.

"అంతేతు కింకిణీవంశ వీణాభ్రమరనిస్వనాః
ఇతి నానావిధా నాదాః శ్రూయంతే దేహమధ్యగాః.

తా. ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమున నిలిచినప్పుడు, మువ్వలు, పిల్లనగ్రోవి, వీణ, తుమ్మెద మొదలగువాని ధ్వని వంటి ధ్వనియు, ఇట్లు వివిధములైన నాదములు దేహమధ్యమున నుండునప్పుడు వినబడుచున్నవి.

మనస్సు:- క్షిప్తము - మూఢము - విక్షిప్తము - ఏకాగ్రము - నిరుద్ధము - అని అయిదు విధములు.

క్షిప్తమనగా - ఒక్కొక్కప్పుడు తన పూర్వకర్మలను బట్టి నానా పదార్థములందు మిక్కిలి యాశతోగూడి ఒకదాని యందు నుండక చలించునట్టి హృదయవ్యాపారము.

మూఢమనగా - తామసము, నిద్ర - నీరసము, అలసత్వము మొదలగువానితో నుండు హృదయవ్యాపారము -

విక్షిప్తమనగా - ఒక సమయమందు సమాధితోగూడి తక్కిన వేళలయందు తదితర విషయములతో గూడియుండు హృదయ పరిస్థితి.

ఏకాగ్రమనగా - యమనియమాదులైన యెనిమిది యోగాభ్యాసముల శక్తికలిగి యొక్కదానియందే ప్రవాహము వలె ప్రవహించు మానసవ్యాపారస్థితి.

ఇదియే సవికల్పసమాధియని చెప్పబడుచున్నది. నిరుద్ధమనగా ఇతర విషయ ప్రసక్తి త్యజించి ఏకాగ్రచిత్తముతో నుండు మనోవ్యాపారము. దీనిని నిర్వికల్ప సమాధియందురు - ఇదియే యోగము.

క్షిప్తము - మూఢము - ఇవి రెండును సమాధికి ఆటంకములు; యోగబలము కల్గినను విక్షిప్తముచే నిలువదు. ఏకాగ్రము నిరుద్ధము ఈ రెండును సమాధిశక్తిని కలిగించును- సమస్తవిషయ పరిచయము త్యజించి యుండుటయే ప్రత్యాహారము.

---

## సమాధి స్థిత జనలక్షణము

శ్లో॥ శఙ్ఖదున్దుభినాదంచ నశ్రుణోతి కదాచన
కాష్ఠవజ్జాయతే దేహ ఉన్మన్యవస్థయాధ్రువమ్॥

తా. ఉన్మన్యవస్థ (అనగా చంచలభావము లేనందున) దేహము శంఖదుందుభి నాదములు వినక నిజముగ కట్టెవలె నుండును.

శ్లో॥ ఖాద్యతే నచకాలేన బాధ్యతే నచకర్మణా
సాధ్యతే నసకేనాపి యోగీ యుక్త స్సమాధినా॥

తా. సమాధియందున్న జ్ఞానిని యముడు మ్రింగలేడు శుభాశుభకర్మము లేవియు నతనిని బాధింపజాలవు. జనన మరణాదులచే కలుగు దుఃఖాదు లతని నేమియు జేయనేరవు. యంత్రమంత్రాది దుష్ప్రయోగాదు లతనిని వ్యథలపెట్టలేవు.

పాతంజల యోగశాస్త్రములో "తతః క్లేశకర్మనివృత్తిః" అనఁగా సమాధిఃబ్ధివలన శుభాశుభ కర్మములును, అవిద్యాది (అజ్ఞానమువలన కలిగిన) క్లేశములు మొదలగునవి యతనిని పీడింపవని కలదు.

శ్లో॥ నగన్ధం నరసం రూపం నచస్పర్శం ననిస్వనమ్
నాత్మానంద పరంవేత్తి యోగీయుక్త స్సమాధినా.

తా: సమాధినిష్ఠుడగు జ్ఞానికి సుగంధదుర్గంధములు, మృదుచులు, రూపము, శీతోష్ణ వివేచనము, శంఖభేరీధ్వనులు, తన శరీరమును, యితరులను తెలియు జ్ఞానముండదు. శరీరము, ధైర్యము, జీవుడు, స్వభావము, పరమాత్మ ఈ శబ్దములు ఆత్మ శబ్దమునకు పర్యాయవాచకములు.

శ్లో॥ ఉపసర్గాః ప్రవర్తన్తే దృష్టేహ్యాత్మని యోగినః
ఏతాంస్తే సంప్రవక్ష్యామి సమాసేన నిబోధమే.

కామ్యాః క్రియా స్తథా కామాన్ మనుష్యో యోఽభివాఞ్ఛతి
స్త్రియో దానఫలం విద్యాం మాయాం కుప్యం ధనదింవమ్.

దేవత్వ మమరేశత్వం రసాయనం వయః క్రియాం
మరుత్ప్ర పదనం యజ్ఞం జలాగ్న్యావేశనం తథా,

శ్రాద్ధానాం సర్వదానానాం ఫలాని నియమాం స్తథా
తథోపవాసా త్పూర్వాశ్చ దేవతాభ్యర్చనాదపి
అతిథి భ్యశ్చకర్మభ్య ఉపసృష్టోఽభివాఞ్ఛతి,

విఘ్నమిత్థం ప్రవర్తె తయత్నాద్యోగీ నివర్తయేత్
బ్రహ్మసంగీ మనఃకుర్వ నుపసర్గైః ప్రముచ్యతే॥

పరమాత్మను సందర్శించు జ్ఞానులకు గలుగు అంతరాయములుజెచింెచెద. కామ్యములు, స్త్రీలు, దానము, విద్య, వంచనము, స్వర్ణరజతములు, తదితర లోహములు, ధనరాశి, దేవలోకము, ఇంద్రపదవి, దేవత్వము, రసాయనము, వయస్సు, కార్యము, యజ్ఞము, జలాగ్నులయందు జొచ్చుట, శ్రాద్ధ ఫలంబును, సమస్త దానఫలమును, నియమములను, కోరు

చున్నాఁడు. మఱియు నుపవాసములు, ఇష్టాపూర్తములగు మడుగులు, నూతులు, దేవాలయములు, తోటలు, అగ్రహార ములు దేవసందర్శనములయం దభిలాష, అతిథులు, కర్మ ములు మొదలగువిఘ్నములు వచ్చుచున్నవి. పద్మపురాణము:

శ్లో॥ యద్వైభిరన్తరాయైర్న క్షిప్యతేఽస్యహి మానసమ్
తదాగ్రే తమవాప్నోతి పరబ్రహ్మేతి దుర్లభమ్॥

తా. వెనుకచెప్పిన విఘ్నములు సంప్రాప్తించినప్పుడు జ్ఞాని మనస్సు స్థిరత్వము కలిగియున్నచో నవి రాజాలవు. తత్క్షణమే యాజ్ఞాని యలభ్యమగు పరబ్రహ్మలో నైక్య మగును. యోగభాస్కరము :

శ్లో॥ సాత్త్వికీంధృతిమాలమ్బ్య యోగీ సత్త్వేన సుస్థిరః
నిర్గుణం మనసా ధ్యాయ న్నుపసర్గైః ప్రముచ్యతే॥"

ఏవంయోగముపాసీనః శక్రాదిపద నిఃస్పృహః
సిద్ధ్యాది వాసనాత్యాగీ జీవన్ముక్తో భవేన్మునిః
విస్తరస్య భయాన్నోక్తా సన్తి విఘ్నాహ్యనేకశః
ధ్యానే నవిఘ్న హరయో ర్వారణీయాహి యోగినా॥"

పరమయోగి సత్త్వగుణముఁగలిగిన ధీరత్వ మవలంబించి సాత్త్వికప్రవృత్తిచే సుస్థిరుడై నిర్గుణపరబ్రహ్మమును హృదయ మందు ధ్యానించువాడైనచో నతని కేవిఘ్నములు రావు. మఱియు యోగాభ్యాసి, ఇంద్రాదిపదవులను సిద్ధ్యాదివాసన లను త్యజించి మననము నే యొనర్చుచుండిన జీవన్ముక్తిసిద్ధి నందును. మఱియు నింకను జ్ఞానికి నంతరాయములు పెక్కు లున్నవి. అవియన్నియు భగవద్ధ్యానమువలన నశించును. యోగకుండల్యుపనిషత్తు శివ సంహిత, వాయు సంహిత,

మార్కండేయ సంహిత, లింగపురాణము, కూర్మపురాణము, సౌరపురాణము మొదలగునవి చూచిన తెలియును.

---

## ధారణ

శ్లో॥ "బద్ధంతు నాదబంధేన మనస్సంత్యక్త చాపలమ్
ప్రయాతి సుతరాంస్థైర్యం ఛిన్నపక్షఃఖగోయథా.

తా. నాదమనుత్రాటిచే గట్టబడి చపలత్వమును విడిచి ఱెక్కలులేని పక్షివలె మిక్కిలి స్థిరత్వమును వహించుట. ధారణ యనబడును.

శ్లో॥ "ప్రాణాయామేనప వనం ప్రత్యాహారేణచేంద్రియం
వశీకృత్య తతః కుర్యా చ్చిత్త స్థైర్యం శుభాశ్రయే.

ప్రాణాయామముచే వాయువును, ప్రత్యాహారముచేత యింద్రియములను లోబఱచుకొని తరువాత సగుణమునుగాని నిర్గుణమునుగాని మనస్సునందు స్థిరముగానుండునట్లు చేయుట ధారణయని విష్ణు పురాణమునందే స్పష్టము.

---

## ధ్యానము

శ్లో॥ "సర్వచిన్తాంపరిత్యజ్య సావధానేన చేతసా
నాద ఏవానుసంధేయో యోగ సామ్రాజ్య మిచ్ఛతా.

తద్రూపప్రత్యయైకాగ్ర్య సన్తతిశ్చాన్యనిః స్పృహా
తత్ ధ్యానం ప్రథమైరఙ్గైః షడ్భిర్నిష్పాద్య తేనృప.

తా. జ్ఞానులు బాహ్యాభ్యంతర చింతలవిడిచి యేకాగ్ర చిత్తములో నాదబ్రహ్మ పదార్థమును ననుష్ఠించుటయే ధ్యానము. ధారణ ధ్యానము - ప్రత్యాహారము కలిసి సమాధి యనబడును. అది జీవసమాధి. జీవునకు పరమాత్మకు నేకత్ర సమావేశము, సంధానమగుట - పరమపదము జేరుట - పద్యతే గమ్యతే జ్ఞానిభిరితి పదమ్.

శ్లో॥ అవధ్యః సర్వశస్త్రాణామశక్యః సర్వదేహినామ్
ఆగ్రాహ్యోమన్త్ర యన్త్రాణాం యోగీయుక్తస్సమాధినా॥

తా. ఇట్లు యోగములోనుండిన జ్ఞానికి ఆయుధముల వల్ల భయములేదు. ప్రాణికోటికిదొరకడు. వశీకరణ, మారణ, స్తంభీకరణ, మోహన, ఉచ్చాటన, విద్వేషణ, మొదలగు మంత్ర యంత్ర ప్రయోగము లతనిని బాధింపలేవు. కాని యోగాభ్యాసికి విఘ్నాదు లనేక ప్రతికూలములు కలుగును. అట్లు విఘ్నాదులు కలుగుటకు కారణములు, వానిని రాకుండ జేయుటకు సాధనములు దత్తాత్రేయులు మొదలగు మహాత్ములు చెప్పియున్నారు.

శ్లో॥ ఆలస్యం ప్రథమో విఘ్నో ద్వితీయస్తు ప్రకథ్యతే
పూర్వోక్త ధూర్తగోష్ఠీచ తృతీయోమన్త్రసాధనమ్
చతుర్థో ధాతువాదస్స్యా దితి యోగవిదోవిదుః॥

ఆలస్యము మొదటివిఘ్నము, మున్ను చెప్పిన ధూర్త సహవాసము, రెండవది, మంత్రసాధనము మూడవది, రస వాదము నాలుగవది అని యోగవేత్తలు చెప్పియున్నారు.

మార్కండేయ పురాణము :-

నారద:–స్వామీ! మీ సదుపదేశమువలన నాయజ్ఞానము పటాపంచలై దివ్యజ్యోతి స్వరూపములో నిమగ్నుడనైతిని. ఇందులకు కారణులైన మిమ్ము శివబ్రహ్మాదుల శ్రీదేవిని నా నేర్చినకొలది స్తవించెద. అనుగ్రహింపుడు అనియిట్లు నారదమహర్షి త్రిమూర్త్యాదులను స్తవనము చేయ దొడంగెను.

---

## నారద కృత త్రిమూర్త్యాది దివ్యమంగళ స్తవనము

అథస్వస్థాయదేవాయ నిత్యాయ హతపాప్మనే
త్యక్తక్రమవిభాగాయ చైతన్యజ్యోతిషే నమః ॥ ౧

దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్తచిన్మాత్రమూర్తయే
స్వానుభూత్యేకమానాయ నమఃశాన్తాయ తేజసే॥ ౨

అనన్తనామధేయాయ సర్వకార్యవిధాయినే
సమస్తమన్త్రవాచ్యాయ విశ్వైకపతయే నమః ॥ ౩

కర్ణికాదిష్వివస్వర్ణ మర్ణవాదిష్వివోదకమ్
భేదిష్వభేది యత్తస్మై పరస్మై మహసే నమః ॥ ౪

నమోవాఙ్మనసాతీత మహిమ్నే పరమేష్ఠినే
త్రిగుణాష్ట గుణానన్త గుణనిర్గుణమూర్తయే॥ ౫

యథాతథాపియఃపూజ్యో యత్రతత్రాపియోఽర్చితః
యోఽపివాసోఽపి వాయోఽసౌ దేవస్తస్మైనమోస్తుమే॥ ౬

నమఃస్వతన్త్ర చిచ్ఛక్తి ముద్రిత స్వవిభూతయే
అవ్యక్తవ్యక్తరూపాయ కస్మైచిన్మన్త్రమూర్తయే॥ ౭

చరాచరజగత్స్ఫారస్ఫురత్తామాత్రధర్మిణే
దుర్విజ్ఞేయరహస్యాయ యుక్తై రప్యాత్మనే నమః ౮

భవబీజాఙ్కురజలదా రాగాద్యాః క్షయముపాగతా యస్య
బ్రహ్మా వా విష్ణుర్వా హరో జినో వా నమస్తస్మై ॥ ౯

నిత్యం నిరావృతి నిజానుభవైకమాన మానన్దధామ జగదఙ్కురబీజమేకమ్
దిగ్దేశకాలకలనాది సమస్తహస్తమర్దాసహం దిశతు శర్మ మహన్మహో వః॥

సర్వః కిలాయమవశః పురుషాణుకర్మకాయాది కారణగణో యదనుగ్రహేణ
విశ్వప్రపఞ్చరచనాచతురత్వమేతి స త్రాయతాం త్రిభువనైకమహేశ్వరో వః

లోకత్రయస్థితిలయోదయకేలికారః కార్యేణ యో హరిహరద్రుహిణత్వమేతి
దేవస్స విశ్వజనవాఙ్మనసాతివృత్తశక్తిః శివం దిశతు శశ్వదనశ్వరం వః ॥

మధ్యాహ్నార్కమరీచికాస్వివ పయః పూరో యదజ్ఞానతః
ఖం వాయుర్జ్వలనో జలం క్షితిరితి త్రైలోక్యమున్మీలతి
యత్తత్వం విదుషాం నిమీలతి పునః స్రగ్భోగి భోగోపమం
సాన్ద్రానన్దముపాస్మహే తదమలం స్వాత్మావబోధం మహః. ౧౩

యస్మాద్విశ్వముదేతి యత్ర రమతే యస్మిన్ పునర్లీయతే
భాసా యస్య జగద్విభాతి సహజానన్దోజ్జ్వలం యన్మహః
శాన్తం శాశ్వతమక్రియం యమపునర్భావాయ భూతేశ్వరం
ద్వైతధ్వాన్తమపాస్య యాన్తి కృతినః ప్రస్తౌమి తం పూరుషమ్.

యస్సృష్టిస్థితి సంహృతీర్వితనుతే బ్రహ్మాదిమూర్తిత్రికై
ర్యస్యాధీనతయా స్థితాని సదసత్కర్మాణ్యపి ప్రాణినామ్
నిత్యేచ్ఛాకృతిబుద్ధిమానథ పరో జీవాత్పరాత్మా స్వయమ్
సోయం నో విదధాతు పూర్ణమచిరాచ్చేతోగతం యద్భవేత్. ౧౫

శక్యం యన్న విశేషతో నిగదితుం ప్రేమైవ యచ్చిన్తితం
మృద్వఙ్గీ వదనేన్దుమణ్డలమివ స్వాన్తే విధత్తే ముదం
యన్ముగ్ధానయనాన్తచేష్టితమివ బాధ్యత్వేఽపి నోలక్షితం
తత్తేజో వినయాదమన్దహృదయానన్దాయ వన్దామహే. ౧౬

విష్ణుర్వా త్రిపురాన్తకో భవతు వా బ్రహ్మా సురేన్ద్రోఽథవా
భానుర్వా శశలక్షణోఽథ భగవాన్ బుద్ధోఽథ సిద్ధోఽథవా

రాగద్వేషవిషార్తి మోహరహితః సత్త్వానుకమ్పాద్యతో
యస్సర్వైస్సహ స స్మృతో గుణగణై స్తస్మై నమ స్సర్వదా. ౧౪
విశ్వేశోప స్సపాయా త్రిగుణ సచివతాంయోఽవలంబ్యానువారం
విష్వద్రీచీన సృష్టిస్థితివలయమజః స్వేచ్ఛయా నిర్మిమీతే
యస్యేయత్తామతీత్య ప్రణవతి మహిమా కోఽపిలోకవ్యతీత
స్త్యక్తో యశ్చతురాద్యైరపి నిపుణతమై ర్వీక్షణాది క్రియావ. ౧౫
బ్రహ్మేన్ద్రదక్షఃకుబేరోయమవరుణమరుద్వహ్ని చన్ద్రేన్ద్రరుద్రా
శ్శైలా నద్యస్సముద్రా గ్రహగణమనుజా దైత్య గన్ధర్వనాగాః
ద్వీపా నక్షత్ర తారారవివసుమునయో వ్యోమభూరశ్వినౌచ
సంలీనా యస్య సర్వే వపుషి స భగవాన్ పాతు వో విశ్వరూపః ౧౬

---

## గణేశ స్తవనము

వన్దే వన్దారుమన్దార మిన్దుభూషణనన్దనమ్
అమన్దానన్దసన్దోహ బన్ధురం సిన్ధురాననమ్. ౧

ఆలమ్బే జగదాలమ్బే హేరమ్బ చరణామ్బుజే
శుష్యన్తి యద్రజఃస్పర్శా త్సద్యః ప్రత్యూహవార్ధయః. ౨

లక్ష్మీం తనోతు సుతరా మితరానపేక్ష
మంఘ్రిద్వయం నిగమశాఖి శిఖాప్రవాళం
హైరంబ మంబురుహడంబర చౌర్యనిఘ్నమ్
విఘ్నాద్రిభేద శతధారధురంధరం నః. 3

---

## శివ స్తవనము

నమస్తుంగశిరశ్చుంబి చంద్రచామరచారవే
త్రైలోక్య నగరారంభ మూలస్తంభాయ శంభవే. ౧

వామాంగీకృతవామాంగి కుండలీకృతకుండలి
ఆవిరస్తు పురోవస్తు భూతిభూత్యంబరాంబరమ్ ౨

చంద్రాననార్ధ దేహాయ చంద్రాంశు సితమూర్తయే
చంద్రార్కానల నేత్రాయ చంద్రార్ధశిరసే నమః. 3

యస్యాహురాగమవిదః పరిపూర్ణశక్తే
రంశేకియత్యపి నివిష్టమముం ప్రపంచం

తస్మై తమాల రుచిభాసురకంధరాయ
నారాయణీ సహచరాయ నమశ్శివాయ॥ ४

త్రాతాభీతిభృతాం పతిశ్చిదచితాంక్లేశం శతాంశంసతాం
హంతాభక్తిమతాం సతాం స్వసమతాం కర్తాపకర్తాఽసతాం

దేవః సేవక భుక్తిముక్తి రచనాభూర్భూర్భువః స్వస్త్రయీ
నిర్మాణస్థితి సంహృతి ప్రకటిత క్రీడోమృడః పాతు వః॥ ౫

# అర్ధ నా రీ శ్వ ర స్త వ ము

మందారమాలా లలితాలకాయై కపాలమాలాఙ్కిత శేఖరాయ
దివ్యామ్బరాయైచ దిగమ్బరాయ నమశ్శివాయైచ నమశ్శివాయ.

# జ గ ద ం బా స్త వ న ము

భిక్షార్థీ సక్వయాతః సుతను బలిమఖే తాండవం క్వాథభద్రే
మన్యేబృందావనాంతే క్వనుసమృగశిశు ర్నైవజానే వరాహం

బాలేకచ్చిన్నదృష్టో జరఠవృషపతి ర్గోప ఏవాస్యవేత్తా
లీలా సంలాప ఇత్థం జలనిధిహిమవత్కన్యయో స్త్రాయతాంవః

## త్రిమూర్తి స్తవనము

నమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్సృష్టేః కేవలాత్మనే
గుణత్రయ విభాగాయ పశ్చాద్భేద ముపేయుషే.

---

## విష్ణు స్తవనము

నమస్త్రిభువనోత్పత్తి స్థితిసంహార హేతవే
విష్ణవేఽపార సంసార పారోత్తరణ సేతవేః

---

## లక్ష్మీ స్తవనము

జయంతి జగతాంమాతుః స్తనకుంకుమ బిందవః
ముకుందాశ్లేష సంక్రాంత కౌస్తుభశ్రీ విడంబినః.

---

## సూర్య స్తవనము

ఖండితానేత్రకంజాలి మంజురంజన పండితాః
మండితాఖిలదిక్ప్రాంతా శ్చండాంశోః పాంతుభానవః.

---

గద్యము ... ... ... ... ... ... ... ... ... ... ...
పండిత ద్వివేది నారాయణశాస్త్రి సంకలిత సత్యగీతయందు
ద్వితీయోల్లాసము ముగిసినది.

---

ఓన్నమః పరస్మై

# "స్త్రీ అభాగిని"

## అను

# సత్యగీత

నార:- స్వామీ! తరువాతివృత్తాంతము తాము సెలవీయవేడెద

విష్ణువు:- దేవీ యిదివఱకు ఆవిర్భవించినవారికంటె ముందు ఆవిర్భవించుచున్న యొక సాధ్వియున్నది. ఆ స్త్రీయందావిర్భవించి దేవుడు లేనివారికి లేడనియు, నున్నవారికి ఉన్నాననియు, లేనివారికికూడ, కొంతమందికి ఉన్నానని నిరూపించెదను. రామకృష్ణ అవతారములో మరికొన్ని అవతారములలో చెప్పి చేయించితిని, చేసి చూపించితిని. అనేకమహిమలునిరూపించితిని. పార్థునిద్వారా, జగత్తునకు గీతా ద్వారా, ధర్మము, అధర్మము, ఉపనిషత్తులు, అనేక జ్ఞానా జ్ఞానములు, అనేక విషయములు, గ్రంథముద్వారా వెల్లడిచేసి యుంటిని. ఆలాగుననే ఆసాధ్వియందావేశించి కొన్ని ధర్మములు, కొన్ని దివ్యసంకల్పములు నిరూపించెదను.

లక్ష్మి:- స్వామీ ఆ స్త్రీజన్మించినదా! జన్మింపబోవుచున్నదా సెలవు ఇవ్వవలసినదిగా ప్రార్థించుచుంటిని.

విష్ణువు:- దేవీ! జన్మించియే యున్నది. 22 సంవత్సరముల వయస్సులో యున్నది.

లక్ష్మి:- దీనదయాళూ ! యెప్పుడు ఆవేశించెదరో తెల్పవలయును. ఏగ్రామమందున్నది. ఏవర్ణము? ఆసాధ్వియొక్క చరిత్రయో తెల్పవలయునని ప్రార్థించుచుంటిని.

విష్ణువు:- శ్రీరంగాపురమను నొక గ్రామము కలదు. శ్రీరంగాపురమనగా- శ్రీసంపద, సాలెపురుగు. పతివ్రతా శిరోమణి, శాంతి, లక్ష్మీదేవి, శ్రీ - రంగ - రజ్యతే అనేనేతిరంగః ముఖ్య తాత్పర్యము - దేవతాంశగల మహిళామణి జన్మస్థలము. ఆ గ్రామాధికారికి యిద్దఱు కుమారులు, ఇద్దఱు కొమార్తెలు గలరు. అతనియొక్క రెండవకొమార్తె. నా గ్రంథములు చదువుచున్న, నామహిమలు చెప్పుచున్నపుడానందము పొంది నాయందు భక్తితో పూజలు, నా నామము చేయుచు, బాల్యమునుండి కూడా భక్తి మార్గములోనే యుండెను.

లక్ష్మి:- స్వామీ ! పూర్వజన్మ పుణ్యఫలంబగుటచేతనేకదా ! ఆవేశించుట. సామాన్యులయందు మీరు ఆవేశించరుకదా! పూర్వజన్మ ఫలంబేమి ?

విష్ణు:- పూర్వము సక్కుబాయి అనే భక్తురాలికి పాండురంగరూపమునదర్శనమిచ్చితిని. సక్కుబాయి నాసంకల్పమువల్ల కష్టములు పొందుచుండ, చివరకు చితిపై ప్రాణభిక్ష పెట్టితిని. సక్కుబాయికి నేను ప్రసన్నమై నీకు ఏమి కోరిక అనిప్రశ్నించితిని. స్వామి యెల్లప్పుడుగూడ మానవజన్మకలిగించుచు, స్త్రీజన్మయెత్తించుచు, అనేక కష్టముల ననుభవించుచు, నీ దివ్యసందర్శనము లభించునట్లు వరం బీయుము. కష్టములు యెక్కువకల్గినవారికి నీదర్శనము

యిచ్చెదవు. సామాన్యులకు నీదర్శనమీయవు కనుక నాకు యెల్లప్పుడు ఈ బాధ లేయొసంగుము. నీ దివ్యసందర్శనము నాకు లభించును అని కోరినది. ఆసక్కుబాయియే. నేను ఆవిర్భవించబోయే స్త్రీ. ఆజన్మఫలితమే ఈజన్మకు సాఫల్యం బయ్యెను. అందువల్ల నే యీ స్త్రీయం దావేశించగలందు లకు కారణమయ్యెను. ఈమెకూడా అనేకమైన బాధలు పడును. సక్కుబాయి అత్తగారివల్ల, భర్తవల్ల బాధలు నొందెను. గాని యీనాడు ఈ స్త్రీ తల్లిదండ్రులవల్ల, సోదరీ సోదరులవల్ల, మిత్రులు, బంధువులు, భర్త, సంతానమువల్ల నాసంకల్పమున, అనేకబాధలు నొందును.

లక్ష్మి:- స్వామీ! మీరు జగన్నియామకులై యుండగా ఆ స్త్రీని బాధలు పెట్టుట యెందులకు? బాధలు పడుటకు కారణం బేమి? ప్రపంచములో స్త్రీలకు పుట్టినయింటివారిలో బాధలు కలుగవుకదా! ఈ స్త్రీకి పుట్టినవారియింట బాధలు నొందగలదని సెలవిచ్చుచుంటిరి.

విష్ణు:- దేవీ! దానవులలో ప్రహ్లాదుడు అవతరించలేదా! స్వార్థరహితుడై మహాభక్తుడైన ధ్రువుడు పుట్టి బాధలు నొందలేదా! పదివేలగజములకు నాథుడైన గజేంద్రుడు మకరిచే బాధలుపడలేదా! ఆసాధ్వి నిష్కామహృదయ. సత్యము నిరూపించుకొనుటకు పాటుబడుచుండును. దైవభక్తిచే యెల్లప్పుడును, నాయందు భక్తితో యుండును. జ్ఞానవంతులకు, భక్తులకు, బాధలు తప్పవు. భక్తులకు మానావమానము లుండవు. భక్తులయొక్క భక్తి ఆచంద్రతారార్కముగా ప్రకాశించును. ఈ కలియుగ

మందు అనేక ఆలయములలో ఆరాధించబడు చుంటిని. అన్నవరము అనే గ్రామమందు రత్నగిరియను పర్వతము గలదు. కొంతకాలము క్రిందట సత్యనారాయణ స్వామి ఆలయముకట్టి మానవులు మహాక్షేత్రముగా చేసియుంచిరి కలియుగములో అనేకమందిభక్తులు ఆ క్షేత్రమునకువచ్చి తరించుచుండిరి. నేను ఆవిర్భవించిన స్త్రీ తల్లిదండ్రులుగూడ ఆక్షేత్రమునకువచ్చి దర్శనము చేసికొనుచుండిరి. ప్రతి సంవత్సరముగూడ నాఆలయమునకువచ్చి చూచుచుండుట చేత ఆనామముతో వాళ్ళకు ఆరాధ్యదేవుడ నయితిని. నేను ఆవేశింపబోవు స్త్రీ నన్ను పూజచేయు చుండెను. ఈమెకు యుక్తవయస్సురాగా తండ్రి వివాహముచేయ ప్రయత్నించుచుండెను.

లక్ష్మి:- స్వామీ! యీ బాల్యములోనే యేమియు సుఖమనేది అనుభవించకుండా కష్టమనేది సంకల్పముచేసితిరి. మీకు దయలేదా! ఈ కలికాలమందు సుఖవాంఛలు గల స్త్రీలను చూచినపుడామెకు విచారంబు కలుగదా! నీభక్తులనే బాధలుపెట్టిన చూచెడివారెవ్వరు? ఎప్పటికైన యీమెకు సుఖంబు కలదా.

విష్ణువు:- నీవున్నవారి యింటనే యుండెదవు, లేనివారియింట లేకుందువు. నీవల్లనే లోకమందు, ధన మమకారంబులకు లోనై భ్రష్టులైయుండిరి. నా సంకల్పము యెన్నిటికిని అలా కాదు. ఎవరియొక్క జ్ఞానము, ధర్మములు, కర్మములు, వారి కర్మానుసారముగ వారివారి ద్వారా నిరూపించు చుందును.

లక్ష్మి:- స్వామీ! చివరకు నన్నే పరిహాసించు చుంటిరా? మీవంటి జగన్నాటక సూత్రధారుల సంకల్పమువలె యెన్నడు సంకల్పముండదు. సంతానముగూడ కలిగెను. గాని అనుకూలమైన సంతానముకాదు. ఆమె బాధ చెప్పుకొనెడిదికాదు. ఎప్పుడూ నా నామస్మరణ చేయుచు దుఃఖించెడిది.

నారదుడు:- వైకుంఠనిలయా, శ్రీహరీ సృష్టికర్తవు నీవే నీ భక్తులకు కష్టములు కలిగించువాడవు నీవే. నీ భక్తుల హృదయములో దుష్ట సంకల్పములు కలుగజేసి పరీక్ష సేయువాడవు నీవే, చివరకు నీ భక్తుల చరిత్రమూకు చెప్పువాడవు నీవే. ఈ చరిత్రలను జగత్తునకు అందజేయు వాడవు నీవే.

విష్ణువు:- నారదా! ఇన్నికారణంబులు కలిగిననే గాని ఆమెయం దావేశ ముఖముగా మానవులకు దర్శనమొసగుట కలుగ నేరదు. ధర్మము స్థాపించుటకు భగవంతుడనైన నేనున్నా నని నిరూపింపగలందుల కీనిదర్శనము.

నార:- స్వామీ! ఈవిధముగా ఆ స్త్రీయం దావేశించినయెడల లోకమునమ్మునా? మానవులామెను ఇంకను బాధించరా! మీ మాయలకు లోనై ఆమెయింకను ఎన్ని బాధలు పడునోకదా!

విష్ణు:- త్రిలోకసంచారీ! నీకు తెలియనిగ్రంథము లేవియు లేవు. జగత్తుకొఱకు లీలలు, లయక్రీడలు, తెలిసికొనియు, అజ్ఞానముగా ప్రశ్నించుచుంటివే.

లక్ష్మీ:- స్వామీ! మీమాయాక్రీడలు యెవ్వరికి వర్ణింపశక్యం బగును? మీ ఆవేశవిషయము చెప్పరే యీమెకు!

విష్ణు:- ఈమె వర్ణింప శక్యముగాని బాధలు పడుచుండెను. ఈమె 22 సంవత్సరముల వయసులో చాలా వ్యాధిగ్రస్తురాలై మరణశయ్యపై నుండగా ఈమె భక్తి, జ్ఞానము, నిరూపించ గలందులకు మానవులందఱికి ఈమె జీవించదన్న నిరాశకలిగినప్పటికినీ, నేను ఈమెయందావేశించి మరణమునుంచి తప్పించితిని. నేను ఆవేశించునాటికి 5 సంవత్సరములనుండి దీర్ఘవ్యాధిలో నుండెను. వారికి నానానామములలో ఆరాధ్యదేవుడనై సత్యదేవుడనే నామముతో ఆవిర్భవించి కొంతకాలమువఱకు భగవంతుడనని చెప్పక అనేకవిధముల బాధలుపెట్టితిని. ఈమె పెద్దసోదరుడు ఆలయముకట్టుట విధి యుండుటచేత ఆమెయున్న గ్రామములో పెద్ద ఆలయముకట్టి క్షేత్రమగుటచేత అనేకమంది అంతరంగభక్తులకు నేనున్నానని నిదర్శనమీయగలందులకు అనేక జగత్కార్యములకొఱకు ఆవేశించుట జరిగెను. ఆమెయందావేశమై 3 మాసములవఱకును పేరు చెప్పలేదు. కొంతకాలమునకు పేరుచెప్పి అనేక నిదర్శనములిచ్చితిని. అనేకమంది దుర్మార్గులు, అనేకమంది కపటభక్తులు నమ్మక, ఆమెను నానాబాధలుపెట్టి, వీధిపాలుజేసిరి. అప్పుడు నిదర్శనము ఇచ్చినప్పటికి నమ్మక చేయరాని దుర్మార్గపుపనులుజేసిరి. అప్పుడామె సోదరులు వారిగృహమునకు తీసికొనివెళ్ళిరి. వారిబుద్ధులు జ్ఞాన, అజ్ఞానములు, వారి సోదరిపై యున్నప్రేమ, అప్రేమలు

నిరూపించ గలందులకు యిక్కడకు తీసికొనివచ్చుటకు సంకల్పముచేసితిని.

శివు:-పురుషోత్తమా! నీసంకల్పము లగమ్యాగోచరములుగదా! నాబోటివానినే అనేకపరీక్షలు జేసి వరంబులొసగితివే! అటు వంటి "అభాగిని" బాధలునొందుట సందేహంబేల?

బ్రహ్మ:- జగదీశ్వరా! పురాణపురుషా! నేను గర్వాంధుడనై యుండ సోమకాసురుడను రాక్షసుని సంకల్పమున జేసి వేదం బుల నపహరింపించి తిరిగి గర్వపరిహారంబునొనర్చి సోమకా సురుని ధ్వంసముజేసి వేదంబులు దెచ్చియిచ్చిన వేద మూర్తివి నీవేగదా! నీ చిద్విలాసములు వర్ణింప నెవరి శక్యములు?

దేవేంద్రుడు:- ఆ బాలగోపాల సేవిత దేవచూడామణీ! గో వర్ధనగిరిధారీ! గోవిందా! ఒకదిక్కునకు ప్రభుడైనవాడను. గోవర్ధనగిరి యెత్తి గర్వపరిహారంబు చేసితివి. మాబోటి వారికే యిన్ని గర్వపరిహారములు నొనర్చితివే! సామా న్యులకు గర్వ పరిహారము నిరూపించుట సంశయంబేల? అదియునుంగాక ఆస్త్రీయందావేశమై, యిన్నినాటకములు సృష్టించుచుంటివి. నీ లీలాక్రీడ లగమ్యాగోచరములుగదా.

విష్ణువు:- శివబ్రహ్మాది దేవతలారా! లోకరక్షకుడనై భక్తుల యొక్క జ్ఞానము దుర్మార్గులయొక్క అసూయా సంకల్ప ములు లోకమునకు అందజేయగలందులకు, భక్తురాలి యొక్క భక్తిగూడ అందజేయుచుంటిని. ఆమె సోదరుని యింటియొద్దనే ఆమెనావేశించి భక్తులకు దర్శనమిచ్చుచు

అనేక తరణోపాయములు చెప్పుచుంటిని. ఆ గృహములో కూడా గృహస్థులకు, అనేకమందిభక్తులకు మోక్షమార్గములు చెప్పుచుంటిని. నేను సామాన్యుడననియు, కొన్ని విషయములు నిరాకరించు చుండిరి. వారివారి కర్మానుసారమునుబట్టి వారనుభవించెదరు. నేనుఆవేశించిన భక్తురాలికి యనేకవిధముల, ఆర్థికముగాను, మానసికముగాను బాధలు సంకల్పించితిని. ఆమె ననుగ్రహించుటకై ఆమె హృదయములోచేరి స్థిమితములేకుండ చేసి, అనేక పిచ్చి మాటలు మాట్లాడునట్లు చేసితిని.

శివు:- జగదీశ్వరా! ఆస్త్రీని ఆవహించి, యెంతమందిని నమ్మించెదరో. ఎందఱకు మోక్షంబిచ్చెదరో మాకు తెలియుట లేదు.

విష్ణు:- శివ బ్రహ్మాది దేవతలారా! రామ, కృష్ణాది అనేక అవతారము లెత్తినప్పుడే, జ్ఞానులు భగవంతుడనియు, అజ్ఞానులు భగవంతుడు గాడనియు ననుకొనిరి. అజ్ఞానులు ఆమెను బూటకమందురు. జ్ఞానులు ఆమెలో భగవంతుడావహించి యున్నాడందురు.

లక్ష్మి:- ఏనాటికైన ఆమెకు దారియున్నదా? లేక ఆవిధంబుగా కుమిలి కృశించి నశింపవలసినదేనా!

నార:- అమ్మా! త్రిలోకారాధినీ! ఈ దేవదేవుడు ప్రళయాంతమువఱకు వచ్చిననేగాని రక్షింపడని నీకు తెలియదా? ఎల్లప్పుడు తన నామోచ్చారణము, తన సంకల్పురాలినిగా జేసికొని, ఆస్త్రీయందే ఆవేశించి, యిన్ని ప్రళయ

ములు కలుగజేసి, తాను లోకోద్ధారణకై వేంచేసియున్నా నని నిరూపించుకొనుచు, పాషాణములందలి రత్నంబు పగిది ప్రకాశించుచు, భక్త పరతంత్రుడనను నామము సార్థక మొనర్చుకొనుచునుండు జగదీశ్వరునిచిత్రింప నెవరి శక్యము తల్లీ ?

లక్ష్మి:- జగదీశ్వరా ! సృష్టిస్థితిలయక్రీడలు గలవాడవు. ఆవేశ ముఖముగా లోకమును నమ్మించుటకు కారణమేమి ?

బ్రహ్మ:- జననీ ! ఈ పరంధాముని చిత్ర, విచిత్ర, సంకల్ప ములు మనకు తెలియనివికావు. అధర్మము సృష్టించి దుర్మార్గులచే పాపపుబనుల చేయించుచు, సన్మార్గులచే పుణ్యకార్యముల చేయించుచు, దుష్టశిక్షణ, శిష్టరక్షణయు నొనరించుచు ధర్మస్థాపన చేయుచున్నాడు. ఇతని లీల లద్భుతములు.

లక్ష్మి:- లోకనాయకా ! నీవు ఆవేశించియున్న స్త్రీకి సుఖ మెన్నటికి కలుగును? అదియే నాకోరిక.

విష్ణు:- నా నామోచ్చారణముచే భక్తులకు, నేను వారి వాడ నవుటయేగాక, నాచే సృష్టించబడిన మీ అందఱిచేగూడ ఆమెకు వరంబులు, ఆశీర్వచనములు గూడ లభించును.

శివు:- లోకనాయకా ! దీనదయాళూ ! తపోధనులకు, దివ్య పురుషులకు, యెన్నియుగములనుంచి నీ నామోచ్చారణ జేసినను, దివ్యదర్శన మీయనివాడవు కలియుగమందొక స్త్రీ నావహించి లోకోద్ధారణకై నీ చిద్విలాసము లనేక ములు నిరూపించుచు, ప్రపంచ మనునది నాటకరంగ

ముగాజేసి, మానవులు నటులుగను, నీవు నటనసూత్రధారివై యుండగా నీభక్తురాలికి మేము వరంబు లొసగెడివారమా! మమ్ముల పరిహాసముగా పరీక్ష చేయుచుంటివా ప్రభూ!

నారదుడు:- పద్మనాభా! నీది యే స్వభావమో వర్ణింపలేము. స్వభావములు, గుణములు సృష్టించిన నిన్నేమని వర్ణింపగలము? నీ పరీక్షలకు, నీ చిద్విలాసమునకు, నీ మందహాసమునకు, నీ నటనకు మితమనేది యెన్నటికినీ లేదు. ప్రపంచస్వరూపా!

లక్ష్మి:- స్వామీ! ఆ సాధ్వినుండి ఎన్నడు తప్పుకొనదవు. ఎప్పటికి ఆమె జీవితమునకు ఆనందము జేకూర్చెదవు. ఆ సాధ్వి సుఖింప మేమందఱ మెన్నడు సంతసించెదము.

విష్ణువు:- దేవీ! ఆమెయం దావహించి, అనేకమందికి తరణోపాయము చెప్పుచుంటిని. ధర్మము ప్రబోధించుచుంటిని. కొందఱు కపటభక్తులు, నే ఆవేశించినటుల, స్వార్థము కొఱకు, కపటనాటకముల నాడుచుండిరి. అట్టి కపటభక్తుల నిరూపించుటకు, కర్మవిమోచనమైనవారికి దర్శనమిచ్చుచు ఆమె జీవితాంతమువఱకు ఆవేశించియుందును. ఈమె లోకమునకు మహాభక్తురాలు, సాధ్వియని నిరూపింతును. ఈమె సుఖములు పొందును. మోక్షము కలుగును. ఈమె నామము దివ్యజ్యోతిగా దేజరిల్లును.

నార:- ఓ కపటనాటక సూత్రధారీ! ఆమెయందు వేంచేసి ఆమె నెట్లు రక్షింతువు?

లక్ష్మి:- ఆమెకు ధనమిచ్చి, నీ సంకల్పమువల్ల కలిగేబాధ విముక్తి చేసెదను.

విష్ణు:- దేవీ! నాభక్తులకు ద్రవ్యము నిచ్చి రక్షింపలేవు. ద్రవ్యము లేకయే యిన్ని బాధల నొందుచున్నదనియా నీ అభిప్రాయము. మానవులు వారివారి కర్మాను సారము బట్టి అనుభవించెదరుగాని. ద్రవ్యమునకు - భక్తికి సంబంధము లేదు.

లక్ష్మి:- జగదీశా! నీకు యెన్నడును ప్రతికూలముగ చెప్పలేదు కడుబీదయైన కుచేలునకు, సిరిసంపదల నిచ్చినవాడవు నీవే కదా! కబీరుదాసుకు, అనేకభక్తులకు క్షణక్షణమున ద్రవ్యము కలుగజేయుచు, వేలకొలది సాధువులకు ఆతిథ్యమిచ్చిన మహానుభావుడవు. నీ మాయాక్రీడలు జగత్తునకు మెఱుగు పెట్టునట్టివి.

నార:- దీనబాంధవా! నీవు ఆవేశముఖంబుగా చెప్పిన కార్యంబుల విశ్వసింపరేల? నిరాకరించుటకు కారణంబేమి?

విష్ణు:- నారదా! మంచిప్రశ్నలు వేయుచుంటివి. వారు స్వార్థపరులు, అహంకార మమకారాదులచే, అజ్ఞానమనెడి చీకటిలో వారివృత్తాంతము వారే తెలిసికొనజాలరు. నేచెప్పు విషయము విశ్వసింపగలశక్తి వారికెక్కడిది?

బ్రహ్మ:- పరాత్పరా! ఇంకను ఆవేశముఖముగా చెప్పుటెందులకు? అట్లుచెప్పిన లాభంబేమి?

విష్ణు:- కమలనాభా! చెప్పినను విశ్వసించనివారు, సోమరిపోతులని లోకమునకు నిరూపింపబడుదురు.

శివు:- ఓ లయకారుడా ! యీ సృష్టియంతయు జేసినది నీవే కదా! మానవుల వేరువేరుగాసృష్టించుటకు కారణంబేమి?

విష్ణు:- మానవుడు, బొమ్మనుచేసి దానినిచూచి ఏవిధముగా ఆనందించునో, ఆలాగుననే జగమును సృష్టిచేసి, మానవులను నటులుగానిర్ణయించి, యీ జగత్తనెడి రంగస్థలమునందు వారివారి కర్మ, కర్మానుసారమునుబట్టి యీ నాటకము ఆడించెదను.

బ్రహ్మ:- దీనదయాళూ! యీ జగత్తనునది రంగస్థలమునకు నటులకు కావలసిన పరికరముల క్రింద సృష్టించితిని. ఈ జగన్నాటకమునకు మితము లేదు.

శివుడు:- సృష్టిలయకారుడా! యెంతకాలమువరకు యీ జగత్ సృష్టికి మితములేదు ? నీ తనయులమగు భక్తుల మరెంత కాలము బాధించెదవు? పరికరములుగా నున్న మమ్ములను, తనయులుగా యున్న మానవులను తప్పులెంచెదవుగా ప్రభూ !

ఇంద్రుడు:- శివ బ్రహ్మ నారదాదులారా ! యింకను మనము ప్రశ్నింపగా, మనలో మనల యీఋవది నాటకము లాడించిన మహానుభావుడు, తిరిగి తీర్పుచెప్పిన దివ్యమూర్తి అమాయకులను మానవుల నాడించుటయందు సందేహమేల ?

లక్ష్మి:- దీనబాంధవా ! జగన్నాయకా ! నీ వావేశించిన స్త్రీ జీవిత మేవిధముగామాఱును? దుర్మార్గులకు జ్ఞానమార్గం బబ్బునా, ప్రపంచమంతయు అనుకూలముగా నుందునా ?

బ్రహ్మ:- వటపత్రశాయీ! గోవిందా! జ్ఞానులనగా యే విధముగా నుందురు? అజ్ఞానులనగా యే విధముగా నుందురు? స్త్రీ పురుషులబుద్ధి నిర్ణయం బేమి? యెట్టివారికి నీదర్శనం బిచ్చెదవు? యెట్టివారికి నీసేవ లభించును?

విష్ణు:- శివ బ్రహ్మాదిదేవతలారా! అజ్ఞానసుజ్ఞానములు చెప్పుచుంటిని వినుడు. జ్ఞానవంతులవిషయము పురుషులుసత్యము పలుకుట, ధనము, కామక్రోధ సుఖవాంఛల విసర్జించిన వారు, తల్లిదండ్రుల పూజించువారు, చెడు సంకల్పములు యితరులుచెప్పునవి వినకుండువారు, సత్యాసత్యములునిరూపించుటకు పాటుపడువారు, ఇతరులబిడ్డల తన బిడ్డలవోలె జూచువారును, ఒకరిసంపదనుకాంక్షింపనివారును, భార్యల చెడు సంకల్పముల విననివారును, భార్యలకు బానిసలుగా నుండనివారును, యెల్లప్పుడు దానధర్మములు చేయువారు ఇతరుల నిందింపనివారు, సోదర, సోదరీ, బంధుమిత్రుల యందు అసూయత లేనివారును, ఏకపత్నీవ్రతులుగనున్న వారును, దుష్టస్థానములకు చేరనివారు, అహంకారమమకారాదులు లేనివారు, మహాసాధువులు, పుణ్యపురుషులని వర్ణింపబడుదురు. స్త్రీ పతియేదైవమని ప్రార్థించునది, అత్తమామల లక్ష్మీరమణులుగ పూజించునది, ఆడుపడుచులు, బావమఱదులయందు యితర బంధువులయందు చాడీలుచెప్పకుండ నుండునది. అహంకారము, అసూయ, లేనిది, యెప్పుడు దైవకార్యములయందు నిమగ్నురాలై యుండునది, పతి కనుకూలముగా యుండునది, ఇతరుల మాట వినుటయందాసక్తిలేనిది. తనగృహామే వైకుంఠముగా నిర్ణయించునది, మితముగా మాట్లాడునది. దాన

ధర్మములు చేయుచు, యితరులబిడ్డల తన బిడ్డలవలె జూచుచు, అహంకారములేనిదియు మహాసాధ్వి, లోకమున మహాపతివ్రతయని నిరూపింపబడును. సంకల్ప ప్రకారముగ నున్నవారు జ్ఞానులుగ పురుషులుగ పతివ్రతలగు స్త్రీలుగను లెక్కింపబడుదురు. ఇవన్నియు లేనివారు దుర్మార్గులుగను, రాక్షససంభూతులగుదురు. దేవదానవులకెంత భేదమున్నదో, దుర్మార్గ, సన్మార్గులకుగూడ నంత భేదమున్నది.

శివబ్రహ్మాది దేవతలు:- జగన్నాయకా! యీ విధముగా సృష్టించు టంతయును నీ సంకల్పమేగదా! వారి వారి కర్మానుసారము నాటకమాడించెదవు. నటన సూత్రధారీ.

లక్ష్మి:- భక్తప్రియా! లోకబంధూ! ఈ విధముగా నీవు ఆవేశించిన బంధువులందఱికి జ్ఞానంబు కలిగించవేమి?

విష్ణువు:- దేవి! యెవరికి యేయొక్క అసూయత సంకల్పము యేవిధముగా కలుగునో వారినోటినుండి వెల్లడి చేసికొందురు, వారి బుద్ధిద్వారానే నిరూపించెదను.

ఇంద్రుడు:- పురుషోత్తమా! పద్మనాభా! అజ్ఞానులను, విజ్ఞానులుగా చేయలేదా! దేవదానవులందఱు విరోధించుచుండ, మమ్మందఱ నొకేబాట నడిపించలేదా! నీవు జగత్తును పీచుగా చేసి త్రాడుగాపేనెదవు. ఆరీతినే భక్తులయిండ్లలోనే భక్తుల నిర్ణయించెదవు. భక్తుల, భక్తిని నిరూపించుచు దర్శనంబిచ్చుచు, భక్తిలేనివారినిగూడ, భక్తులుగానొనర్చి మోక్షమార్గం బిచ్చెదవు.

శివుడు:- నీలమేఘశ్యామా! నీవు కలియుగమం దొకసాధ్వి నావేశించి వారి గృహమెంత పరమపవిత్రము చేయు చుందువోకదా! ఆగృహస్థులు, బంధువులు తదితరప్రజలు యెంత ధన్యులగుదురోకదా? స్త్రీయం దావేశించి వారికి నీ మృదువాక్కులు చెప్పుచున్న వారు విని యెంత మోదంబందుచున్నారో నీకే తెలియును. కలియుగమందు గూడ సన్మార్గులు, భక్తులు నున్నారని నీకే తెలియును. నీవు సర్వాంతర్యామివి గాన సర్వము నీకే తెలియును.

నార:- వైకుంఠనిలయా! దుర్మార్గ సన్మార్గములు రెండును నీకు సమానములే? ఆ తేడా మానవులకే గాని నీకు యేదియు లేదు. నీలో జగత్తు సర్వముపుట్టినది. ఆకాశము, భూమి శివబ్రహ్మాది దేవతలు నీలో ఉద్భవించినారు. నారాయణ నామమంతయు నీలోనే నిండియున్నదికదా! నారాయణమూర్తివి నీవేకదా! నీవులేని వస్తు వెక్కడ నైన యున్నదా ప్రభూ! జనన మరణములు లేకుండ ప్రకాశించువాడవు నీవే! లోకరక్షకా! నిన్ను వర్ణించుటకు మితమనేది లేదుకదా! అమిత స్వరూపా!

లక్ష్మి:- కరుణాంతహృదయా! ఆవేశముఖముగా వారితప్పులు వారికి చెప్పవేమి? వారితప్పు దాచనేల? నీవు ఆవేశించి యుండ చేయరానిపాపములు చేయుచున్నారే! పాపము లెక్కువగుచుండ పరిహారంపవేమి? వారితప్పు నిరూపింప వేమి?

విష్ణు:- దేవీ! నీకేమియు తెలియదు. అజ్ఞానప్రశ్నలు వేయకుము.

బ్రహ్మ:- లోకారాధినీ - జననీ ! ఈయన అవతారం బెత్తక ముందు, ఆవేశించకముందు, అజ్ఞానముకన్న, అధర్మమునకన్న, యీాయన ఆవేశించి అధర్మము, అజ్ఞానము, పాపములుకలిగించుచుండును. ఎక్కువగాచేయనిచ్చి, దుష్ట సంహారము శిష్టరక్షణ గావించును. ఇతనిలీలలు వర్ణింపఁ దరమా !

నార:- లోకారాధ్యా! ఎంతకాలము ఆ స్త్రీయందు వేంచేసి యుందురు? మీా ధర్మస్థాపన, యెంతవఱకు స్థాపింపగలరు? మీారు ఆవేశింపగా చెప్పినవిషయములు మానవులు విశ్వసించెదరా! మీా విశ్వమహిమలు వర్ణింప నశక్యము.

విష్ణు:- త్రిలోకసంచారీ! ఎల్లప్పుడు యీా స్త్రీయందే వేంచేసి ధర్మము స్థాపించుట కాదు. అక్కడక్కడ పవిత్రముగల స్త్రీ పురుషులయం దావిర్భవించి, ధర్మము స్థాపించుచు, జ్ఞానముబోధచేయుచు, భగవంతుడను నేనున్నానని నిరూపించుచు, ఆలయముకట్టుటకు సంకల్పముచేయుచు, లోకారాధ్యుడనై సేవింపబడుదును.

బ్రహ్మ:- దీనదయాళూ! ని న్నే వి ధ ము గా ధ్యానించిన మోక్షము నందగలరు ?

శివుడు:- ఓ సత్యావాదీ! అతని మహిమలు వర్ణింపదరముగానివి. అతని జగత్ సృష్టికి మితమన్నది లేదు. అతనిని యేవిధముగా ధ్యానించినను మానవులు సాంసారిక దుఃఖముల తరించి మోక్షమును బొందెదరు.

నార:- శివ బ్రహ్మాది దేవతలారా! యితని దివ్య చిద్విలాసముల కంతము కలదా! గోపికలు ప్రేమచేత, గోపాలకులు స్నేహముచేత, కంస శిశుపాల దంతవక్త్రులు విరోధముచేత, దుర్యోధన కర్ణ భీష్మాదులు అహంకారముచేత, యితని నామస్మరణ జేసి మోక్షమును జెందిరి. మానవులయం దితనికి యేకదృష్టియే గాని మఱొక భావంబుండదు. వారివారికర్మలనుబట్టి యనుభవించెదరు. కర్మయన్నది కూడ జగన్నాటక సూత్రధారియే విధించి యున్నాడు.

లక్ష్మి:- దీనబాంధవా! దేవా! కపట నాటకముగా నీవున్నావని సంచరించెడి స్త్రీ పురుషులను నిరూపించకపోయిన యెడల నీవు ఆవేశించినవారికి బాధలుకావా! నీవు నిజముగా యెవరియం దావేశించి యున్నావో మానవులకు తెలియని యెడల ఆవేశించిన వారిని ఆవేశించనివారిని ఒకటేయని మానవులు తలంచరా!

విష్ణు:- దేవీ! నేను ఆవేశించినచోట సత్యములు చెప్పుచుంటిని. మానవులకు తెలియనివిషయములు చెప్పుట, ధర్మబోధన చేయుట, భక్తిమార్గము చెప్పుట, భగవద్గీత నుపదేశించుట ఆగమశాస్త్రంబులు తెల్పుట, జగత్ సృష్టి అవతారము లనేకములు చెప్పుట, అనేక భక్తులవ్యాధులు నివారణ చేయుట, కోరికలుఫలింపజేయుట, ప్రబలమైన నిదర్శనము లిచ్చుట, ఎన్ని అవాంతరమైన సంకల్పములు కలిగించినప్పటికి, ఆవేశించినవారికి, ధైర్యశక్తియిచ్చుట, మొదలగు నా మహిమలనేకములు నిరూపించెదను.

నారః- వైకుంఠనిలయా! లక్ష్మీవల్లభా! మీరు ఆవేశించని వారి కపటనాటకము లేవిధముగాయుండునో తెల్పుమని ప్రార్థన.

విష్ణు:- శివ బ్రహ్మాది దేవతలారా! తెల్పెదవినుడు. వారిష్టము వచ్చినపుడు నే నావేశించినట్లు నటింతురు. వారి యుదర పోషణకు స్వార్థపరులై; మమ్ము దేవుడావేశించినాడనియు వారి యిష్టప్రకారముగా నే వేంచేసినట్లు చెప్పుకొనెదరు. అసూయ, దుర్మార్గసంకల్పములు వారికి కల్గును. వారి దుర్మార్గబుద్ధిని, వారి కపటనాటకము, అసూయ, యివన్నియు వారి బుద్ధిద్వారా నిరూపించుకొనెదరు. అపుడా కపట నాటకావేశము నిరూపించగలందులకు, నే నావేశించినచోట అనేకమైన నా మహిమలు నిరూపించెదను. ఒకరు శాంతింపుమన్నను శాంతించను. ఆవేశింపుమన్నను ఆవేశింపను. కపటనాటకము, మోసములకే మానవులు లొంగుచున్నారు. కపటనాటకమనునది యెంత కాలమో నిలువదు. ఈ దొంగఆవేశములు నిరూపించ గలందులకు, నే నావేశించినచోట సత్యము నిరూపించి, యీ కపటనాటకమాడు దొంగలను లోకమునకు బయల్పఱతును.

లక్ష్మి:- లోక నియామకుండవగు నీవే యిన్ని కపటనాటకము లాడిన నీ సంకల్పమువల్ల సృష్టించబడ్డ మానవు లజ్ఞానములో యీాదులాడుటకు సందేహంబేమి?

నారః- కమలవాసినీ, ఆయన జగత్తునకే నటనసూత్రధారి. ఆయన మహిమలత్యద్భుతములు. ఆయన లోకపరిపాలకుం

డగుటచేతసత్ప్రవ ర్తన, స త్త్వగుణము భ క్తి, జ్ఞాన అజ్ఞాన ములు భ క్తులను రక్షించుచు, భ క్త రక్షణ, దుష్టశిక్షణ చేయుచునుండు నప్పరమాత్ముని లీలలు వర్ణింపరానివితల్లీ.

లక్ష్మి:- ప్రియనాథా! అనాథనాథా! మీరు ఆవిర్భవించని ప్రదేశములలో మీరావిర్భవించినట్లు అమాయక ప్రజలు నమ్మి వచ్చుచుండిరికదా! వారి కోరికలు ఫలించు చున్నవా!

బ్రహ్మ:- లోకారాధినీ! ఇతడు సర్వాంతర్యామికదా! అతడావే శించినచోట కపటనాటకముగా వీని నామము పెట్టుకొని సంచరించుచున్నప్పటికిన్ని, అతనినామ ఫలితంబువలన సర్వకార్యములు సిద్ధించును.

విష్ణు:- శివబ్రహ్మాది దేవతలారా! యే తపస్వులు యే ఆల యము దగ్గఱకు వచ్చి మోక్షము పొందిరి. ఏ దివ్య పురుషులు యే తపస్సుచేసి మోక్షము బొందిరి. భ క్తు లన్నవారెక్కడ ప్రార్థించిన అక్కడనేయుంటిని. నాయందు భ క్తిగలవారు ప్రేమగలవారు నేనావేశింపని చోటునకు వెళ్ళినప్పటికిన్ని నే నున్నానని వారు భ క్తితో నమ్మికతో వెళ్ళుటచేత సంకల్పసిద్ధులగు చుండిరి. తెలిసికొన్న సుజ్ఞానులకు ఆత్మస్వరూపమన్నది నేనువారి దేహమే దేవా లయము వారి శాంతము, సత్ప్రవ ర్తనాది గుణములేవారికి సర్వైశ్వర్యములు. మానవులు దుర్మార్గులయి నప్పటికిన్ని నానామనువల్ల మోక్షముబొందెదరు. కౌరవులు అహం కారముచేత నా నామము తలచి మోక్షము పొందిరి. కంస శిశుపాల దంతవక్త్రులు విరోధంబుచే మోక్షం

బందిరి. రావణకుంభకర్ణాది రాక్షసుల, ఆ అవతారముననే, వాళ్ళను సంహారించుటచేత మోక్షము పొందిరి. ప్రేమ చేత, పగచేత, భయముచేత, యేవిధముగా నయినను మోక్షమందెదరు.

నార:- అమ్మా! జగన్నాథు లెందులేరని మీ సంకల్పము జగత్తునకు నాథుడై యుండ ఆయన సంకల్పములేనిదే యే కార్యము సిద్ధింపదు. ఆయన భక్తులభక్తి నిరూపించుచు భక్తపరతంత్రుడగును.

నార:- క్షీరాబ్ధివాసినీ! జగన్నాథుల మహిమలు తెలియక మీరు ప్రశ్నించుచున్నారు. ఆమెకు బాధలు కలుగుచున్న వని విచారించుచుంటివి. ఈ బాధలుకలుగుటగూడ జగన్నాథుని సంకల్పములు గావా? రత్నమునకు సాణుగు పెట్టు చున్నట్లు భక్తులను పరీక్ష చేయువాడు వారిని పరీక్షజేసి అంతరంగిక భక్తులనియు, జగత్ ప్రకాశకులనియు తెల్పును. అతని నే విధముగా నారాధించెదరో, నతని భక్తుల చరిత్రలు విని అంతగా ఆనందించెదరు. తన భక్తులకై యెన్ని బాధలు పొందలేదు? సక్కుబాయి వేషధారియై స్తంభమునకు కట్టుబడి ఆ విప్రగృహంబులో దాస్యంబు చేసిన ధన్యమూర్తి. జ్ఞానదేవాదు లెక్కిన ప్రాకారంబు నడిపించలేదా? నామదేవుని యింట యింటి నేతవాడై గృహనిర్మాణముపూర్తి చేయలేదా? భక్తులకు వర్ణింప శక్యముగాని అనేక కార్యములు భక్తికిలోనై చేయలేదా? భక్తులకొఱకు తన చిద్విలాసంబుల నెన్నియో నిరూపించు చుండును. ఈతని నామముకొఱకై

యీతని పాదసేవకై భక్తులు పరితపింతురు. తాను నట్లే పరితపించును. భవద్భక్తులు గుణసంస్తూయమానులై యున్నగాని భాగవతోత్తములని పేరు నొందరు. భగవచ్చర్య లత్యద్భుతములు తల్లీ.

లక్ష్మి:- లోకైకనాథా! మీరొకప్పు డా స్త్రీయం దావేశించి వారిగృహమందలి తప్పులు తెల్పుచుండ ఆ గృహములోని స్త్రీలుకూడ మీమీద వాదనకువచ్చిరని సెలవిచ్చి యుండిరి ఏ విధముగా ఖండించిరి? ఏ విధముగా వారు వాదించిరి? భగవంతులైన మీమీద వాదించుటకు కారణమేమి? సెలవు ఇవ్వవలసినదిగా కోరుచున్నాను.

విష్ణువు:- నేనావేశించి యున్నపుడు నే చెప్పిన విషయములు విశ్వసించుట లేదనియు, భ్రష్టులగుదురనియు నాగ్రహపూర్వకముగా వారికి చెప్పియుంటిని. నే నీ విధముగా చెప్పుటచే, భక్తురాలే యీ విధముగా చెప్పుచున్నదనియు, వారనేక విధముల నితరులపై బెట్టి యామెను దూషింపసాగిరి. మమ్ముల నావహించి నా భక్తురాలినే దూషించుచున్నారని చెప్పుచుండెడివాడను తిరిగి నే శాంతించిన తరువాత యితరులద్వారా యీ విషయములు తెలిసికొని. ఇవన్నియు భగవంతుని ప్రేరేపణము మీద దూషించుచున్నాననియు, రక్షింపవలసిన భగవంతుడే యీ విధముగా బాధించుచున్నాడనియు రక్షకుడే యీ విధముగా నన్ను కష్టపెట్టిన దిక్కెవ్వరనియు దుఃఖించెడిది.

నార:- జగన్నాథా! మానవుల హృదయములో చేరి సద్బుద్ధులు కలుగజేయుట మీరేకదా! ఆమె మనస్సునకు శాంతిలేకుండా చేయుట మీరేగదా! ఆ స్త్రీయందావహించి ఆ గృహమునందలి స్త్రీలను మీరు తప్పు చేయుచున్నారను టెందులకు? స్త్రీ పురుషులందఱు అజ్ఞానదశలో నున్నప్పటికి, పూర్వజన్మ సుకృతమువలన నామెయందావహించి యున్నారు. నీవు భగవంతుడవని తెలిసికొనలేక స్త్రీ పురుషులు, నీ భక్తురాలికి నీభక్తులకు, నీ ఆలయమునకు సేవచేయుచున్నామని చెప్పుచుండిరి. ఇవన్నియు నీ చిద్విలాసములే!

బ్రహ్మ:-పురాణపురుషా!పురుషోత్తమా!నీవేసర్వేశ్వరుడవుకదా! ఆ గృహములో నున్న స్త్రీపురుషులు మేము జేయుచున్న కార్యములు సర్వేశ్వరుడని తెలియుటకు కారణంబేమి?

విష్ణు:- శివబ్రహ్మాది దేవతలారా, భక్తురాలనెడి వారిభక్తి. సత్త్వవర్తన గుణము గలవారు అసూయ సంకల్పము లేనివారు. వారి గుణములు వారు చెప్పుకొందురు. వారి అధైర్య విషయములు వారు వెల్లడి చేసికొనరు. భక్తి నాకే తెలియును గాని యితరులకు తెలియదు. దుష్ప్రవర్తన గలవారి విషయము చెప్పుచుంటిని వినుము. క్షణక్షణము వారి భావములు వారి నోటిద్వారా వెల్లడి చేసికొందురు. ప్రగల్భములు, గొప్పలు చెప్పుకొనుట ఇతరుల దూషించుట మనసులో నున్న దొకటి బయటకు చెప్పునది మరొకటి ఉదరపోషణార్థము వారిట్లు చెప్పు

కొందురు. వీరిమాటలు, నిజమని అజ్ఞానులనుకొందురు. ప్రపంచములోమానవుల భావము తెలిసికొను వారుజ్ఞానులు.

దేవే:- బాలగోపాల చూడామణీ! గోవిందా! నీవు సముద్రంబు తఱచి శుభములు చేకూర్చుటకు, దానవులను, మమ్ములను నిమిత్తమాత్రుల గావించి సముద్రము తఱచి అమృత ముద్భవింపచేసిన అఖిలాండస్వరూపా! నీవు నీ భక్తులను గూడ ఆ విధముగా తఱచి వారి వారి గుణములు అట్టి నీ మహిమలు మేమే తెలియలేక పోతిమి. అజ్ఞానములో నున్న మానవులు నీ మహిమలు తెలియలేక పోవుటకు సందేహమేమి?

లక్ష్మి:- లోకరక్షకా! మీ భక్తురాలైన ఆసాధ్వి గూడ మీరు చెప్పిన ఆజ్ఞలు విశ్వసించిన తరువాత, మాఱుటకు కారణంబేమి? గర్వాంధురాలై మిమ్ము తిరస్కరించుచున్నదా!

విష్ణు:- దేవీ గర్వాంధురాలై మాఱుటలేదు, ఆమె నాఆజ్ఞలను శిరసావహించి చేయలేక పోయినదని మీరు అనుకొనుచున్నారు. నా సంకల్పముచే కొంతకాలమాయెను. ఆదరణతో జూచిరి. తిరిగి ఆదరణ లేకపోవుటచే నా ఆవేశముభరించుచు ఆహారపోషణ చేసికొనుటకారణమయ్యెను హృదయవేదన పడుచు తన తప్పు క్షమాపణ వేడుచు నన్ను ప్రార్థించును.

నార:- జగన్నాథుని మహిమ లద్భుతములుగదా! వారి హృదయముల జేరి బాధించుచుంటివా దేవా! ఎంత కాల మీ విధముగా పరీక్ష చేయుచుందువు ప్రభూ.

విష్ణు:- త్రిలోకసుందరీ ! నీకు తెలియని దేమున్నది ? ప్రళయము వఱకు వచ్చినగాని, భక్త పరతంత్రుడగాను అగ్నిజ్వాలలో గాలిపోవు చున్నప్పుడు గాని చేయూత నిచ్చి రక్షింపను భక్తుని, స్థిరభక్తి యేర్పడువఱకు పరీక్షింతును. భక్త పరతంత్రుడను.

లక్ష్మి:- జగదీశ్వరా ! ఆమె నాజ్ఞలలో యెంతకాలముంచెదరు? ఇంతకాలముగా మీ ఆజ్ఞలను పాటించి బాధపడుచున్నదే? మీకు దయ కలుగదా !

విష్ణు:- దేవీ! మరణశయ్యనుండి బ్రతికించి ఆవేశించినరోజుననే యే నామముతో వారి కారాధ్యదేవుడనో ఆ నామముతో ప్రకాశించుచున్న అన్నవరము వచ్చి, అక్కడ సేవించేవఱకు బ్రహ్మచర్యములో నుండుమని ఆజ్ఞ యిచ్చితిని. అక్కడ కామె వచ్చినది. బ్రహ్మచర్యవ్రతము విరమించుట కాజ్ఞ యిచ్చితిని. అక్కడ కూడ కొంతమంది కపటభక్తులు భగవంతుడు కాడనియు ఆమెకు వ్యాధి యనియు వారి అసూయత, దుష్ట సంకల్పములు నిరూపించుట కావిధముగా నీచముగా మాట్లాడిరి. నిజమైన భక్తుల కెన్నడట్టిమాటలు రావు. అక్కడ నున్నవారు ద్రవ్యాపేక్ష పరులని గ్రహించుము.

నార:- స్వామీ ! ఒక మహర్షి మేమందఱము కలసి యజ్ఞ ఫలితుడని ప్రశ్నింపగా నీ ఫలితము నిరూపింప గలందులకై అనేకమంది మహాభక్తులు శేషాద్రిమీద తపస్సు చేయగా, లక్ష్మీదేవితోసహా ఆ పర్వతముపై భక్తులను రక్షించుటకు వేంచేసియుంటివి. అక్కడకు వచ్చిన

నీభ క్తురాలికి దర్శనంబీయక యెంతపరీక్ష చేసితిరి? నీవు ఆమె గృహములో ఆమెను పెట్టినబాధ లేగాక, నీవువచ్చినచోట గూడ ననేకబాధలు పెట్టుచుంటివి. నీపరీక్ష కాగగలశక్తి గలవారే నీభక్తులని నిరూపించెదవు.

బ్రహ్మ:- మునీంద్రా! జగన్నాథుని మహిమలు తెలియనివి కావు. అతని భక్తుల పేర్లతనితో ప్రకాశించుచుండును. ఈనాడీకలియుగమం దీసాధ్వియం దావేశించి తన చిద్విలాసముల నిరూపించుచు, భక్తుల బ్రోచుచు నావేశముఖముగా నుండెను. ఆతడు చేయజాలని కార్యమొకట్టి గలదా!

లక్ష్మి:- స్వామీ! ఈమె నగ్నిజ్వాలనుంచి చేయూతనిచ్చి రక్షించెదవా? యింకను బాధలతో పరీక్షించెదవా?

విష్ణు:- దేవీ! భగవద్భక్తులకు కష్టసుఖములను నవి వేరుగా నుండవు. ఎల్లప్పుడు నా నామము స్థిరమని నమ్మిన భక్తుల కెన్ని యిక్కట్టులు వచ్చినను అవి బాధలుగా వారు భావింపరు.

లక్ష్మి:- స్వామీ! నీ మందహాసపు మాటలతో మమ్ముల మోసము చేసెదరు. ఆ సాధ్వి సంగతి చెప్పనేల? మానవులకు కావలసిన భోగభాగ్యము లామెకు లేకుండచేసియు నిలువనీడ లేకుండ చేసియు, వారివారి గృహములం దామెను త్రిప్పుచు నింకనుఆతీరున బాధించుచుంటిరి. ఈవిధి భక్తుల నాడించుట నీకే దగును. ఆడుట కా భక్తులే తగుదురు.

నార:- అమ్మా! లోకారాధ్యా! ఆడించువా డాడింపగా బొమ్మలాడకేమి చేయును? ఈ మహిమలన్నియు ఆనటన సూత్రధారి, మురారివనియే నమ్ముము.

లక్ష్మి:- దేవాదిదేవా! దీనబాంధవా! నీ నామము నిలిపి కొనవా! ఈ అభాగినిని బంధువులలోచేరి బాధలనొందించు చుంటివా! అగ్నిజ్వాలలో ఆజ్యముపోయుచుంటివా!

నార:- కమలనివాసినీ! జగన్నాథుని మహిమ లద్భుతంబులు. అనేక యుగములు తపంబొనర్చినను దొరకని మహాను భావుడు. దీనబాంధవుడ ననే పేరు నిలుపుకొనుటకు యీ కలిమాయలో, పాపభీతి చక్రంబులో, తన పాదంబుంచి ఆ స్త్రీయం దావహించి భగవంతుడు లేడను వారికి తానున్నానని నిరూపించుటకు అంతరంగిక భక్తు లకు దర్శన మిచ్చుచు, భగవంతుడ నేనున్నాననుచు సుజ్ఞానము ప్రసాదించుచు భక్తరక్షాపరుడు, దుష్టశిక్షా పరుడై ప్రకాశించుచున్నాడు.

బ్రహ్మ:- జననీ! భక్తురాలిమీదగల ప్రేమచే నీ విధముగా ప్రశ్నించు చుంటివికాని, జగన్నాథునకు తెలియని మహిమ జగతిని లేదు. జగతికి పురాణ పురుషుడని తెలిసి కొనుము.

విష్ణు:- శివబ్రహ్మాది దేవతలారా! లక్ష్మి కలవారి యింటనే ఉండి లేనివారింట లేకుండ పోవును. జగత్తు సుఖ వాంఛలకు, ధన మమకారమున కీమెకు లొంగి భ్రష్టులగు చున్నారు.

లక్ష్మి:— జగతిలో మానవులు నావల్ల భ్రష్టులైన, మీవల్ల ప్రసిద్ధు లగుచున్నారుగదా !

శివు:— మహాత్మా! ఎంతకాలము యీ కలియుగములో ఆవేశ ముఖముగా నుండెదరు. ఇంకెక్కడైన ఆవేశించెదరా ! యీ స్త్రీతోడనే సమాప్తియా !

విష్ణు :— ఇంకను పవిత్రమైన స్త్రీ, పురుషులయం దావే శించెదను.

శివు :— ఈ కలి యెంతవఱకు సృష్టించెదరు. ఎంత అయినది. ఇంకెంతయున్నది ?

విష్ణు :— వేదమార్గమున రెండవ పాదము జరుగుచున్నది. కృష్ణావతారములో పార్థునిద్వారా భగవద్గీత నుపదేశించి యున్నాను. కలియుగములో రెండవపాదము జరుగు చున్నప్పుడు, అక్కడక్కడ ఆవేశముఖముగా కొంతమందికి కనిపించెదనని చెప్పియుంటిని.

లక్ష్మి :— వైకుంఠనిలయా ! నీ భక్తురాలి నొకచోనుంచక ఆ యా గృహములకు వెళ్ళునటు లాజ్ఞ యిచ్చితిరేల ! మీ రెక్క డావహించిన భక్తు లక్కడకే వచ్చెదరుగదా!

నార :— అమ్మా ! ఆతడు భక్తపరాధీనుడని నీకు తెలియుగదా ఆతని ఆంతరంగిక భక్తులెచ్చటున్న, నచ్చటే దర్శన మిచ్చునుగదా ! రాయబారమునకు కౌరవుల యింటికి వెడలి, విదురునింట విందుకు వెళ్ళలేదా ! భక్తితో తెచ్చి యిచ్చిన శబరి యెంగిలిఫలములు భక్షింపలేదా ! ఆతడు సర్వాంతర్యామిగదా !

లక్ష్మి :- జగన్నాథా! అక్కడక్కడ ఆవేశించుచుంటివని చెప్పుచుంటివి. ఇతరచోట ఆవేశించిన విషయములు యీ స్త్రీయందావేశించి చెప్పుచుంటివి. ఈ స్త్రీ యందావేశించిన సంగతులితరచోట్ల చెప్పవేమి? ఏ ఆవేశము నిజమో యేది అబద్ధమో తెలియకున్నది. ఇట్టి ఆవేశము లోకమందుండుటచే, నీవు ఆవేశించిన యీ స్త్రీకి పెక్కు బాధలుకలుగుచున్నవి. మా స్వామి, మా స్వామి యను కొనుటకు కారణంబేమి? ఈ భక్తురాలిని బూటకమందు రేల? ఆమెమీద నెపములుంచుటకు కారణమేమి? ఇది మానవుల నాటకమా? నీ నాటకమా!

విష్ణు:- నీవున్నచోటనే విరోధములు వచ్చుగాని, నా నామమున్నచోట భక్తిమార్గముననే ఉందురు.

నార:- ప్రభూ! నీమందహాస పరీక్షలు దెలియ నేరితరము? నీవు లేనిదే, లక్ష్మి లేనిదే, జగత్తే లేదు. సర్వకాలములు నీయందే యున్నవి. మాయాస్వరూపిణియైన ఆదిశక్తి లక్ష్మిలో, నిరాకారస్వరూపుడవైన నీజ్యోతిలో, జగత్తు సర్వము సృష్టి అయియున్నది. జగన్నాటక స్వరూపులు మీ యిద్దరికే తగును, మా కింకను తెలియని విషయములు తెలుప ప్రార్థించుచుంటిని.

బ్రహ్మ:- శ్రీహరీ! మీ ఆవేశవిషయము లింకను తెలుపుమని ప్రార్థించుచున్నాను. ఈ స్త్రీయందావేశించి, గ్రంథము వ్రాయించుచున్నారుగదా! ఇతరస్త్రీలయందావహించి ప్రపంచవిషయగ్రంథము వ్రాయించరాదా!

శివు:- జగద్రక్షకా! పురుషోత్తమా! ఈ స్త్రీయందావేశమునకు ఇతర స్త్రీయందావేశములో గల మార్పునకు కారణము తెలుప ప్రార్థించుచుంటిని.

దేవేం :- దీనబాంధవా! మీ మహిమలువిన్నకొద్ది ఆనందము మితిమీరుచున్నదిగదా!

విష్ణు:- శివబ్రహ్మాది దేవేంద్ర, నారదాదులారా! అనేకాలయములలో అనేకనామములతో ప్రకాశించుచుంటిని. పవిత్రమూర్తులయందావేశించుచుంటిని. ఈ ఆవేశించిన భక్తుల యొద్ద స్వార్థపరులు, అసూయాపరులు ప్రవేశించి, మా దేవునిమహిమ మెక్కువని చాటించుచుండిరి. భగవద్భక్తి, జ్ఞానము, శాంతముగలవారు దైవిక విషయముల విమర్శింపరు. నామభేదమేగాని భగవంతు డొక్కడే యని గుర్తింతురు. భగవంతు నెఱిగినవారు అసందర్భ ప్రచారము చేయరు. భాగవతోత్తములు నాచిద్విలాసములు తెలిసికొన్నవారే, సర్వనమస్కృతా! కేశవాయ అని తెలిసికొందురు.

లక్ష్మి :- దేవా! యిదియంతయు నీ కపటనాటకమే! నీభక్తురాలు బాధలు నొందజూచుచుంటివి. నీకు దయలేదా! ఈమెయందింతనిర్దయకు కారణంబేమి? తలచితికిన్ త్రాచు తీఱున నీమె, నేలపై పఱువెత్తనీక నిలిపితివి. స్వార్థపరులు నిన్ను నిందించుచుండ, అచ్చట యేనామముతో నున్నావో ఆనామముతో వారివిషయములు తెలుపవేమి?

నార:- అమ్మా! లోకారాధ్యా! ఈ మహానుభావు నేవిధముగా పూజించినను మోక్షము కలుగును. శిశుపాల దంత

వక్తృలు అహంకారముచేతనైనను వారి యాత్మజ్యోతి యీ మహాత్మ్మని జేరలేదా? దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేయునా డీతడేగదా? ఇతర ఆవేశములుగల స్త్రీలలో జేరి యీ సాధ్విని పరీక్ష చేయగలందులకు, వారి హృదయముల అసూయా సంకల్పము కలిగించుచు వారిద్వారా నీమెను పరీక్ష చేయుచున్నాడు. పరీక్ష చేసినగాని యీతడు భక్తపరతంత్రుడుగాజాలడని తెలియునుగదా! ఈ కలియుగములో అనేక అలయములలో ప్రకాశించుచున్నాడు. ఆ ఆలయములు సృష్టించిన భక్తులపేర్లు చిరస్థాయిగా నిలుచునున్నవి. ప్రపంచములోలేని,ఆవేశముఖముగా యీ స్త్రీయందావేశించి ఒకఅవతారము నిరూపించుచున్నాడు. ఇతని అవతారము యీ స్త్రీ ముఖతయని యీ గ్రంథము చాటుచున్నది. ఇతర స్త్రీ, పురుషులయందావేశమునకు యీ స్త్రీయందావేశమునకు సంబంధము లేదు. విశ్వరూప మహిమ లనేకవిధముల చూపించును. ఆమెకు కష్టములు కలుగుచున్నవని మీరనుకొనుచుంటిరి. ఈకలియుగములో ఆమెనామ మాచంద్రతారార్కము ప్రకాశించును. ఆమె నామముద్వారా యీ ఆలయములో యీమహానుభావుని ప్రపంచ మానవు లారాధింతురు. మహాక్షేత్రముగా నా ఆలయము ప్రకాశించును. ఇప్పుడు ప్రకాశించుచున్న సుమతి, ద్రౌపది, అహల్యా, మొదలగు మహాసాధ్వీలలామల చరితంబునకు తీసిపోదు. ఈ సాధ్వీచరిత్ర గ్రంథముద్వారా మానవుల కందించుచున్నాడు. తదితరచోట్ల ఆవేశించి నప్పటికి వారివారి కార్యక్రమములకొఱకేగాని, వారి నామముల నితరులకు దెల్పుటలేదు. ఈ బాల్యదశలో,

సర్వపరిత్యాగినియైనఆసాధ్వీహృదయమందాతడుపూర్తిగా నావహించియున్నాడు. ఆమెకు దేహబలము, ఆర్థికబలము లేదు. ఇతర ఆవేశము గలవారికి దేహబలము, ఆర్థికబలము నుండుటచే వారికి గర్వమెక్కువ. అందుచే, నిగర్వి౯ణియైన యీసాధ్వీయందు దివ్యకళలతో దేదీప్యమానముగా ప్రకాశించుచున్నాడు.

లక్ష్మి:- వైకుంఠనిలయా! ఈసాధ్వి దీక్ష సత్యదేవా అని ప్రకాశించు 'రత్నగిరి'మీద విరమించుమని ఆజ్ఞయిచ్చితిరిగదా! విరమించినతరువాత సంతానప్రాప్తియున్నదా తెల్పుమని ప్రార్థించుచుంటిని.

నారద:- తల్లీ! రత్నగిరిపై, నీసన్నిధిని స్వామియుండ, మీకీ విమర్శలెందుకుతల్లీ!

విష్ణు:- దేవి! విరమించినవెంటనే సంతానప్రాప్తి కలుగదు. నే ఆవేశింపని క్రితముగూడ సంతానమున్నది. ఇక పవిత్ర మూర్తులైన బిడ్డ లుదయించెదరు. స్త్రీలు గర్భోదయము నందు యెక్కువకాలము భరించుచున్నారు. ఈమె యేడు మాసములకంటె నెక్కువ మోయుభారములేదు. నాపవిత్ర సంకల్పమున యేడవమాసముననే బిడ్డలు జన్మించెదరు.

లక్ష్మి:- దేవా! మీవిచిత్రసంకల్పములు మానవులు గ్రహింప జాలరు. బ్రహ్మచర్యము నిర్వహించుచు, సంతానము కనుచున్నదని ఆమెను నిందలపాలుచేయరా! మానవులు ఆమె నావిధముగా బాధించుచుండ చూచుచుంటివో ప్రభూ! నీవు ఆవేశించి నీమహిమలామెద్వారా నిరూపించి బూట

కములనుచున్న యీమానవులు, యీమె సంతానవిషయములోఁగూడ నట్లే యందురు. ఆమెను విషమపరీక్ష చేయుటకు కొద్దిమాసములలోనే సంతానప్రాప్తి కలుగునట్లు సృష్టి గావించితివి.

నార :- అమ్మా! జగన్నాథుని దివ్యశక్తి నీకు తెలియనిది కాదు. అతని దివ్యశక్తి యేవిధముగా ప్రసరింపవలెనన్న ఆ విధముగా ప్రసరించును. ఆ మహానుభావుని తెలిసిన వారజ్ఞానముగా ప్రశ్నింపరు. పవిత్రముగలవారియందతడావహించి వారి పవిత్రచరిత్ర లోకమునకు ప్రకాశింపచేయును. ఆమెహృదయమందుచేరి లోకమున కీగ్రంథము నందచేయుచున్నాడు. ఈ మహాత్ముని దయచే నామె ధన్యురాలయ్యెను. పురుషోత్తమా! మీకృపవలన మీభక్తురాలి చరిత్ర వింటిని సెలవిచ్చిన సత్యలోకమునకుబోవుదును.

శివ :- దేవా! మీ దయవల్ల మీ భక్తులచరిత్ర యింత కాలముగా మీవల్లవింటిని. సెలవిచ్చినచో కైలాసగిరి కరుగుదును.

బ్రహ్మ :- మీ భక్తురాలిచరిత్ర వినిన దుఃఖము కలిగినప్పటికి మీ వల్ల నామెచరిత్ర వినగలిగితిని.

లక్ష్మి :- జగన్నాథా! నీవు భక్తపరాయణుడవై, భక్తులనెల్ల పరీక్షించుచుంటివా! నీవు ఆవేశించిన భక్తురాలిని నీవు ఆవేశించికూడ, దర్పమనియు, యిది కపటనాటకమనియు, ననుటకు కారణంబేమి?

విష్ణు :- దేవీ! ప్రపంచములో కొంతమంది దుర్మార్గులు, దయ్యములు పట్టినవారిని బాగుచేయుదుమనియు, మంత్రములు యంత్రములు వేయుట, అనేక కార్యములుచేయుచు, మాంత్రికులమని పేరుపెట్టుకొని వారిభుక్తికొఱకై అనేక కపట నాటకము లాడుచుండిరి. ఉదరపోషణ నిమిత్తమై వారాడుచున్నదంతయు నాటకమని నిరూపించుటకుగాను, యంత్రము, తంత్రము వేయు కపటమాంత్రికులు, నేనావేశించిన భక్తురాలిగృహమునకు వచ్చునట్లు సంకల్పించితిని.

నారద:- వైకుంఠధామా! ఆత్మ, పరమాత్మవు, నీవేకదా! మరణించిన మానవులు దయ్యములగుట యథార్థమా? కాదా? దయయుంచి తెల్పుడని ప్రార్థన.

విష్ణు:- నారదా! ప్రపంచమందు మాంత్రికులవల్ల తంత్రబలము అబద్ధమనియు, వారిగర్వ పరిహార మొనర్చుటకుగాను నేను ఆవేశించిన స్త్రీయొద్దకు వచ్చినట్లు సంకల్పించి జపములు చేయుమని మంత్రము వేయుమని వారికావేశముఖములో చెప్పితిని. గర్వాంధులగు యీ మాంత్రికులు ఒకడట్లుచేయుట మంత్రమువేయుట ప్రారంభించిరి. ఆదుర్మార్గులు ఇది భగవంతుఁడుకాడనియు, దయ్యమనియు ననుట ప్రారంభించిరి. నా మహిమ తెలిసికొనలేక, మానవులు దయ్యమని ప్రచారము చేయుచు అచ్చటచ్చటనే ఆవేశించిన వారిని బాధపరుచుచుండుట జరుగుచున్నది. ఈ ప్రపంచములో దయ్యము, భూతము మంత్ర తంత్ర శక్తులులేవు. సర్వము నాదని గ్రహింపకుండిరి. నామహిమ గ్రహించు శక్తికూడ వారికి సంకల్పించి యుండలేదు.

నేనీ సాధ్వియం దావేశించి నప్పటినుంచి గాని, అంతకు క్రితమునుంచి గాని, దయ్యమనియు, ప్రయోగమనియు యెవరు ననలేదు. ఆమె నాతన్మయములోనుండి నా నామస్మరణ జేయుచుండెడిది. నే నావేశించిపూడ యిటు వంటి ధర్మమను సంగతి ఆమెయందు నేను సంకల్పించ లేదు. ఆ గృహములో అట్టిసంగతు లేమియు జరుగలేదు. ఒక దుర్మార్గుడు, మాంత్రికుడనని కపటములు ప్రారం భించి, అబద్ధములు చెప్పుచు మోసములుచేయుచు నుండెడి వాడు. ఇట్టివారు చాలమంది కలరుకాని, యీ మాంత్రి కుడు, వాని కర్మానుసారము నేను ఆవేశించిన ప్రదేశము నకు వచ్చుటకు సంకల్పము గలిగించితిని. నేను ఆ మాంత్రికునకు ఆవేశముఖముగా అనేక దివ్యవిషయముల చెప్పుచుండ ఆవేశములో నాతో యేమియు మాటాడక యితర చోటునకుపోయి, దుష్టప్రవర్తనతో దేవుడు లే డనియు దయ్యమనియు చెప్పుచుండెను. నేనే అక్కడ జపముచేసి మంత్రము వేసినాననియు చెప్పుచుండెను.

బ్రహ్మ :- పరంధామా శ్రీహరీ! శకటాసురుడు, తృణా వర్తుడు, బకాసుర, కంస, జరాసంధ, శిశుపాల, దంత వక్త్రులు యెన్నోవిషయములవల్ల అనేక మంత్ర తంత్ర నాటకములతో నిన్ను సంహరింప ప్రయత్నించిరి గదా! అటువంటి వారిని పటాపంచలుచేసిన, మహాను భావుడవుగదా! దుష్టశిక్షణ శిష్టరక్షణకారుండవై, రావణ కుంభకర్ణాదుల, హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను సంహరించినవాడవు నీవే! అట్టి మాంత్రికుల గర్వ

మడంచుటకు సందేహమేలస్వామి? నీదృష్టిలో వీరెంత వారు? ఈ కలిమాయలో యీ మానవు లెంతటివారు? ఇట్టి కపటమాంత్రికుల సృష్టించి ఆమెను ఇంకను అల్లరి పాలుచేసి పరీక్షించుటయా నీ సంకల్పము! ఈ మానవులలోచేరి, యిట్టి దుష్ప్రవర్తనలను సంకల్పించి ఆమెను బాధించి, ఆ పరీక్షలకు నిలుచుశక్తి ఆమె భక్తురాలనియు నీవు భక్తపరాయణుడవనియు, నీ మహిమ లీగ్రంథము ద్వారా లోకమునకు అందజేయుచుంటివి. నీ యీ విచిత్రములు మానవులు గ్రహింపగల్గుదురా స్వామీ!

లక్ష్మి :- జగన్నాథా! మీ రెన్నిచోట్ల, యెంతమంది స్త్రీ పురుషులయందావేశించుచుంటిరోగదా? ఆవేశించినచోట మీరు దయ్యమని చెప్పుటకు కారణమేమి? అచట యెందుకు ఆవేశించితిరి?

విష్ణు :- నే నావేశించినచోట, దేవుడుకాడని యెంతోమంది స్త్రీ పురుషులు అల్లరిచేయుచుండిరి. అప్పుడు నేను వారిని పరీక్షించుటకు అచ్చటకు వెళ్ళి ఆవేశించి, నే భగవంతుడ ననిచెప్పి, నిదర్శన మిచ్చినను, నమ్మక, దయ్యమనియు, భగవంతుడు దర్శనమిచ్చునా యనియు ననిరి. అందులకుగాను వారు దయ్యమను నారంభించిరి. వారి గర్వమడంచుటకు, భ్రష్టత్వము చేయుటకుగాను. భయంకరమైన నిదర్శనలచూపి దయ్యమను భ్రమకల్గించితిని. వా రజ్ఞానములోబడి మంత్రములు వేయుచుండిరి. కొంతకాల మట్లు చేయించి వారికి నా సత్యము నిరూపించితిని. కష్టములు గలిగినగాని, భగవంతుని చిద్వి

లాసములు మానవులు గ్రహింపలేరు. ఈ మాంత్రికులు, నేనెచ్చట ఆవేశించిన అచ్చటకు వచ్చునట్లు చేయుట ప్రారంభించితిని. వారిని పరీక్షించి, వారి మాంత్రిక తంత్రములు కల్లలని నిరూపించుటకుగాను, యీ మాంత్రికుల కపట నాటకములు లోకాని కందజేసి, ఆరంభమగులో మాత్రము లేదని నిరూపించుటకు, వీరు జపముచేసిన కొలది దయ్యమని సంకల్పించు చుంటిని. ఇట్లు కొంత కాలము చేసినగాని సత్యము నిరూపించను. కొంతమంది స్త్రీలు నే నావేశించినట్లుగా దొంగనాటకాలాడు చుండిరి. అదికూడ నా సంకల్పమే.

లక్ష్మి:- లోకనాయకా! మీరు పలుతావుల అనేక నామములతో ఆవేశించుచుంటిరిగదా! కొంతమంది మాంత్రికులు, కపట భక్తులు కొందఱు దుర్మార్గులగు స్త్రీలుకలసి, అక్కడిమాటలు ఇక్కడ ఇక్కడి మాటలు అక్కడ చెప్పి అనేక విధముల బాధించుచుండిరి. భక్తులకు భక్తురాండ్రకు, మధ్య తగాదాలుపెట్టు యీకపట భక్తులగు మాంత్రికులను శిక్షింపరేమిస్వామీ?

నార:- అమ్మా! మానవులకు సత్ప్రవర్తన, దుష్ప్రవర్తన, యేదలవఱచిన యీమహానుభావుడే! మానవులలో అనేక అహంభావములు కలుగ జేయుచు, మంచి చెడుగుల సమానముగా సృష్టించి, మాంత్రికుడై మాయానాటక మాడించు జగన్నాటక సూత్రధారి యితడేగదా! క్షణకాలములో సృష్టించుట, మరుక్షణములో నశింపుచేయుట కీతడే సరిగదా! ఈ మహానుభావునిచే సృష్టింపడుబ

మహానిదర్శనములు కృష్ణావతారములో గారడీ వాడనిరి. కొంతమంది మహానుభావు డనిరి. ఈ మహానుభావుని గారడీవిద్య మాయానాటకము గ్రహించు శక్తిలేక దేవుడు పసుపు, కుంకుమ, ప్రసాదము యిచ్చునా? గుడ్డలు, కొంపలు తగులబెట్టునా? అని కొంతమంది దుర్మార్గులు ప్రచారము చేయుచుండిరి. ఇంద్రజాల మహేంద్రజాల జగదీశ స్వరూపుడైన విశ్వస్వరూపుడైన జగద్రక్షకుని మహిమలు తెలిసికొనలేక యెన్నోవిధముల నిందించు చుండిరి. ఈ మహానుభావుడు వారికి జ్ఞానోదయము గావించుటలేదు. ఎన్నో అవతారములెత్తి, ఎన్నో గారడీ విద్యలు చేసియున్నాడు. మానవులు జనన మరణములు తెలిసికొనిన భగవంతుని ఆనాడే తెలిసికొందురు.

లక్ష్మి :- స్వామీ ! నీవు ఆవేశించిన వారికి నీవల్లవచ్చు బాధలేగాక, వారి సోదరులు, వారి భార్యలుగూడ నామెను బాధించుచుండిరే? ఆమె గ్రామ గ్రామాలు తిరుగుటకు కారణమేమి? ఆమెసోదరులు, వారి భార్యలు వేయి పడగలు సర్పమువోలె విహరించి బాధించుచుండిరి. తల చిటికిన త్రాచువోలె యీ భర్తురాలు బాధపడుచున్నది. ఆమెయందు నీకుదయలేదా? ఇంతనిర్దయకు కారణంబేమి?

విష్ణు :- దేవీ! ఆమెకు నిలువ నీడలేకుండజేసి, సోదరుని గృహమందాజ్ఞ యిచ్చి, సోదరుల భార్యలు, తమభర్తలకు తెలియకుండ నామెను బాధించుచుండ ఆర్థికముగా, సోదరులు బాధపెట్టుచుండ ఆగృహమునుంచి, లేవగొట్టించి తిరిగి ఆగృహమునకు వెళ్ళుట కాజ్ఞ యీయకుండసంకల్పము

కలిగించితిని. అందుకామెసోదరులు, వారిభార్యలు, చేసిన తప్పులుసమర్థించుకొనుచు, ఆమెనుగృహమునుండిపొమ్మన లేదనియు, ఆమె వారిని అల్లరిపెట్టుచున్నదనియు, వారను చుండిరిగదా! వారి తప్పులుగాని, వారి భార్యల తప్పులు గాని వారు బయటపెట్టుకొందురా! ఈవిధముగా బాధలు పడినగాని, ఆమెకు ముక్తిలేదు. ఆమె త్వరలోనే, బిడ్డల తోను, భర్తతోను, గృహస్థురాలగునటుల జేసెదను.

లక్ష్మి :- దేవాదిదేవా! ఎప్పు డానందము పొందునోగాని, యిప్పుడు కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్నది. ఆమె బంధువులు, సోదరులు సోదరుల భార్యలు, వారికి సిరి సంపదలు లేకపోవుటవల్ల. దయార్ద్రహృదయులు కాక పోవుటవల్ల, యీామె దుఃఖము నివారించువారు లేరు. ఆర్త్రత్రాణ పరాయణా! ఆమె నాదరింపుము.

నార :- అమ్మా! యిది యంతయు నామె తప్పేయనుట కోపముతోకూడినమానవ స్వభావంబు. ఆమె ఒకరక్షకుని పాదసేవ చేయుటచేతను, సర్వ మతడని ఆరాధించుటచే తను, ఆమె తప్పులేదనియు, ఆమె భక్తురాలనియు మానవులదే తప్పనియు యీా భక్తురాలి భక్తికి తాను కట్టుబడియున్నాననియు యీా గ్రంథము ద్వారా ఆమె భక్తిలోకమునకు వెల్లడిచేయుచులడిరి.

లక్ష్మి :- దేవా! మీా భక్తురాలికి అనేక ఆశీర్వచనములు.

విష్ణు :- దేవీ! నే నావేశించు కాలమగుచున్నది. నాకొఱకై అనేక భక్తులు వేంచేసియుండిరి. ఆమెయందావేశించి వారికి దర్శన మీయవలయును. నేనేగెదను. ఇది జీవ సమాధి. లక్షణములు దెల్పియుంటిని.

లక్ష్మి :- దేవా! ఈమె మహాత్మ్యరాలు ఎట్లనిన? ఈమె, రసనాసీమను బాలా బీజాక్షరత్రయమును చరణతలమందు చక్రాది దేవాంశచిహ్నములునుగలవు. భక్తపరాధీనుడవు నీదివ్యలీల లద్భుతములుగదా! నీవు నుడివిన జీవసమాధి లక్షణములు తెలిసికొంటిని. నీదయవలన ధన్యురాలన జెల్లితిని. ఇవియే నానమస్కృతులు.

—: స మా ప్తి :—

---

## గ ద్య ము

ఇది శ్రీమద్గౌతమ్యంతర్యాత భారద్వాజ తటినీ తటనివిష్ట విద్వత్కుంజర పింజరగ్రామాగ్రహార వాస్తవ్య భారద్వాజ పవిత్రగోత్ర ద్వివేదివంశ పయఃపారావార రాకా సుధాకర పరదేవతా కాత్యాయనీ ప్రత్యక్షసాక్షాత్కారలబ్ధలబ్ధ వర్ణవర్ణనీయ సకలవిద్యావైశద్య బాలపతంజలి వ్యాకరణమహారాబు ప్రముఖబిరుదావళీవిరాజిత సాష్టాదశపరగణాయుత పెద్దాపురీపరి పాలక విద్వత్తిమ్మజగపతి మహారాజ మానసంరక్షక తద్దత్త

హేమసింహాసన శిబికాధిరోహక నవద్వీపాగతోద్దండ పండిత విజేతృ పండితనారాయణశాస్త్రి ప్రపౌత్ర, కోండయాపర నామధేయ రామచంద్రశాస్త్రి పౌత్ర, నాగాంబా గర్భశుక్తి ముక్తాఫలాయమాన వెంకటరామాంతర్వాణి తనూభవ మద్రమండల పరిషత్పరివృఢదత్త బాలసరస్వత్యుభయభాషా కవి, సాకేత నగరపరిషదాదిప్రదత్త దైవజ్ఞభూషణ, సాహిత్య రత్న, కవిరత్న, భిషగ్రత్న, ప్రబంధక బిరుదవిరాజి శివనాడీ ప్రముఖ, నవనాడీ ప్రవీణ పండిత నారాయణశాస్త్రి సంకలిత "స్త్రీ అభాగిని" అను సత్యగీతయందలి తృతీయోల్లాసము ముగిసినది.

ఓమ్ తత్సత్ పరబ్రహ్మార్పణమస్తు.

మంగళం చిద్విలాసాయ
మహనీయ గుణాబ్ధయే
రంగాపుర నివాసాయ
సత్యదేవాయ మఙ్గళమ్॥



# గ్రంథసమాప్తి

1. ఇతివిరచితబన్ధా పద్ధతి ర్వ్యా మయేయం
సకల గుణిగణానాం ప్రీతయే సాస్తు నిత్యమ్
విపులవిమల దీవ్యత్సత్కలానాం నిధానం
తరుణతరణిరుద్ధా విద్విషత్కౌశికానామ్.

... ... ...

2. అస్యాభ్యాసాద్గ్రంథ వర్యస్య శిష్యః
సర్వజ్ఞస్స్యా ద్విస్ఫురచ్చారుబుద్ధిః
అర్థం కామం వేత్తి ధర్మంచ మోక్షం
నిస్సందేహం శీలితుం పణ్డితోఽపి.

... ... ...

3. శాస్త్రాబ్ధింసకలంవిలోక్య నితరాంగ్రంథః కృతోఽయంమయా
లోకానందకర స్సమస్త సుకలా సంతానజైవాతృకః
అస్యాస్వాద్య సుభాషితామృతరసా నానన్ద పూర్ణాన్తరాః
సన్తు స్సంప్రతి నాకవాసనిరతాన్ దేవాన్ హసన్తు ధ్రువమ్.

# విజ్ఞప్తి

4. దృష్టంకి మపిలోకేస్మి న్ననిర్దోషం ననిర్గుణమ్
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః

# ఆశీర్వచనమ్

5. సర్వే భవన్తు సుఖిన స్సర్వేసంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖ భాగ్భవేత్.

110 వ పేజీ తఱువాయిగ చదువనగును

## చంద్ర స్తవనము

లాలయన్త మరవిన్దవనాని క్షాలయన్త మభితో భువనాని
పాలయన్త మథ కోకకులాని జ్యోతిషాంపతి మహం మహయామి॥

## బ్రహ్మ స్తవనము

తంవన్దే పద్మసద్మాన ముపవీతచ్ఛటాఛలాత్
గఙ్గాస్రోతస్త్రయేణైవ యం సదైవ నిషేవతే.

## సరస్వతీ స్తవనము

ధాతుశ్చతుర్ముఖీ కంఠశృంగాటక విహారిణీం
నిత్యం ప్రగల్భ వాచాలా ముపతిష్ఠే సరస్వతీమ్.

## పృథివీ స్తవనము

స్వర్గాభోగి రదో నివాసి పురుషారబ్ధాతి శుద్ధాధ్వర
స్వాహాకార వషట్క్రియోత్థ మమృతం స్వాదీయ ఆదీయతే
అమ్నాయ ప్రవణైరలంకృతిజుషే౽ముష్యై మనుష్యైః శుభై
ర్దివ్యక్షేత్ర సరిత్పవిత్రవపుషే దేవ్యై పృథివ్యై నమః.






# ज्योतिर्निलयम, एलूरु

## శ్రీ పరదేవతాఽపరావతార, శేషమహాముని చక్రవర్తి ముఖావతరిత మహోత్కృష్ట హోరా శాస్త్రము.

“జ్యోతిషంముఖం” వేదమునకు ముఖము జ్యోతిషము (ముఖ్యాంగము) జ్యోతి అనగా సౌరచాంద్రాది రూపమగు ఒక గొప్ప తేజఃపుంజము, అదియే నిర్వికార ప్రకాశమాన పరాశక్తి స్వరూపము. అద్దాని యుపాసనాధ్యానాదులం బట్టియే కాలము తెలియదగు. మఱియు నవగ్రహముల సంచారములవల్లనే మానవుల మనోగతులు మారును. అది తెలిసినవాఁడే కాలజ్ఞుండు (జ్యోతిష్కుఁడు) అట్టి మహావిద్య మహాఋషులు మహోపాసనాదులవలన గనుగొని పలు తెఱంగుల వెలువరించిరి. అందును “శివనాడీ కలా మతా” అను శ్రీపరాశక్తి వచనమునంజేసి ఫలముల చెప్పుటయందేమి యితరములు దెల్పుటయందేమి మిక్కిలి తార్కాణమై యొప్పుచున్నది యీ శివనాడియే. దీని ప్రాశస్త్య విధమిందు వెల్లడింప బడుచున్నది.

శివ,భృగు,సత్య,నంది,ధృవ, సిద్ధ, బృహస్పతి శుక్ర మత్స్యసం
భవనవనాడులందుగల భావుకయోగ ఫలంబులెల్ల, మీ
కవగతమౌ విధంబునను నచ్చపు తేటతెలుంగు మాటలన్
శివసతిసాక్షి, వ్రాయబడుచున్నగ నో జనులార చూడుడీ.

| | | | |
|---|---|---|---|
| 89 | 4 | లరి | లం |
| 91 | 15 | ము మూ | ముః నుః |
| 92 | 23 | క్రో | క్షో |
| 93 | 14 | ష్గో | హో |
| ,, | 15 | ద్దధ్ధో | ద్ధ్రి |
| 102 | 11 | ఘనదిc వమ్ | ఘనందివమ్ |
| ,, | 18 | నుష | న్నుష |
| 104 | 17 | ధ్య | ద్య |
| 108 | 7 | చంద్రేద్ర | చంద్రేంద్ర |



శ్రీ మాత్రే నమః

# శ్రీ శివనాడీ జ్యోతిర్నిలయమ్, ఏలూరు.



## వివరములు

1. జాతక ద్వాదశభావములు మహాదశాంతర్దశావిదశలతో దిన చర్యతోగూడ వివరముగ వ్రాయుటకు యోగలగ్న - రాజయోగ లగ్నముల శోధనతోసహా రు 225-0-0
2. ద్వాదశభావములు మహాదశాంతర్దశా విదశలతో రాశివేసి ఉభయచరీ యోగములతో వ్రాయుటకు 125-0-0
3. మహాదశాంతర్దశా ఫలములు వ్రాయుటకు 50-0-0
4. మహా దశాఫలములు వ్రాయుటకు 25-0-0
5. ఒక ఆయుర్భావము 4 విధములచే నిర్ణయించి మారక నిర్ణయము చేయుటకు 20-0-0
6. ఒక పుత్రభావమును గురించి వివరముగ వ్రాయుటకు 15-0-0
7. ఒక కళత్రభావమును వ్రాయుటకు 10-0-0
8. మిగతా యే భావమునకైనను భావమొక్కంటికి 5-0-0
9. అయిదు సంవత్సరముల కాలమునకైనను ఫలము వ్రాయుటకు 6-0-0
10. సంహితాది నాడీగ్రంథములను బట్టియు సాముదాయిక (Collective) ఫలములను వ్రాయుటకు 5-0-0
11. జాతకమునకు గ్రహస్ఫుటీకరణము చేయుటకు షోడశవర్గులు కట్టుటకు 5-0-0
12. జాతకము లేనివారికి వారుపుట్టిన సంవత్సరము, మాసము, పక్షమును, తిథియును, వారమును, వేళను మాత్రము పంపించిన యెడల జాతకము వ్రాసి మహాదశాంతర్దశలను గట్టి తన్వాదిద్వాదశభావములకు వివరముగ ఫలము వ్రాయుటకు 25-0-0

(సందర్భ ప్రశ్నయెడల వేళ (time) అవసరము లేదు. వారమక్కరలేదు. తిథియు నవసరము లేదు. ఇంగ్లీషు సంవత్సరము, నెల - తేదీ యుండిన చాలును. ఇది జన్మలగ్న జాతకములతో సమానముగ బుజువిచ్చును.)

13. లగ్న సందేహమున్న తెల్పినచో గత ఫలములను తదితర సంగతులు విచారించి లగ్నము నిశ్చయించి ఫలములు వ్రాయబడును.

14. జాతకములు పంపువారు పైన వ్రాసిన ప్రకారము, ఇయ్య వలసిన సొమ్ములో $\frac{1}{3}$ (మూడవవంతు) సొమ్మును జాతకముతో గూడ మణియార్డరు ద్వారా పంపించవలయును. మిగతా పైకమునకు జాతకము వ్రాసినపిమ్మట అది వి. పి. గా పంపించబడును.

| | |
|---|---|
| 15. ప్రశ్నభాగమునకు | 1-0-0 |
| 16. వివాహాది ముహూర్తములకు | 2-0-0 |
| 17. వాస్తు నిర్ణయమునకు | 5-0-0 |
| 18. నష్టజాతకము జన్మతేది లేనివారికి నామనక్షత్రము ప్రకారము విమర్శించి జన్మతేదీః సరిగా యుండునట్లు దైవీ నాడీ విధానముగా జాతకఫలములు (5 సం॥కు) క్లుప్తముగా వ్రాయుటకు | 10-0-0 |
| 19. కవచములు (1 కి) పోస్టుఖర్చులతో సహా | 5-8-0 |
| 20. భృగునాడి - మొదలగునాడుల ఫలములకు | 25-0-0 |

వలయువారు:-

దైవజ్ఞ భూషణ,

పండిత—ద్వివేది నారాయణశాస్త్రి.

పవరుపేట - ఏలూరు. (ప. గో. జిల్లా)

శ్రీ ఆంజనేయ పవర్ ప్రెస్, ఏలూరు.